## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలుపైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలుపైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035281

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam

Author:

Year: to

Subject: Any Subject

Language: Telugu

Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పునర్నిర్మాణానికి శంఖారావం

## 2 వ భాగము

డా॥ మోపిదేవి కృష్ణస్వామి

ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్
ఎడ్యుకేషన్ ట్రస్టు ప్రచురణ

# ఇందులో....

# స్వాగతం పలుకుదాం!

వందల సంవత్సరాల బానిసత్వంలో వివిధ జాతుల పద ఘట్టనల క్రింద నలిగిపోయిన భారతజాతి తన రూపురేఖలను దాదాపు కోల్పోయింది. అయినా దాని పునర్నిర్మాణ ప్రయత్నమన్నది ఎప్పుడో ప్రారంభమైనది. శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానందుడు, శ్రీ అరవిందుడు, మాస్టర్ ఇ. కె. మొదలైన మహనీయుల ద్వారా ఆ ప్రజ్ఞ రూపుకట్టి వెలుగు బాటలు వేయుచున్నది.

మన జాతియొక్క ప్రస్తుత స్వరూపం ఎలా ఉన్నదో దానికి కారణాలేమిటో విశ్లేషించి నొప్పించకుండా కర్తవ్యాన్ని బోధించి ముందుకు నడిపించే సారథి శ్రీ మోపిదేవి కృష్ణస్వామి. జన్మ జన్మల సాధనకు మాస్టర్ ఇ. కె. సన్నిధి పెన్నిధికాగా పరమగురువుల ఆశీస్సులతో అదనుకు అందివచ్చిన ఉద్యమ సారథి మాస్టర్ ఎమ్. కె.

మాస్టర్ ఇ. కె. గారి కుటుంబం, వారి జగద్గురుపీఠం వారి ఉద్యమం అనుమూడు స్రోతస్సులలో ఇ. కె. గారి ఉద్యమం అనే పాయ ఎం. కె. గారి బాసటలో 'మానవ ధర్మ శిక్షణ సంస్థ'గా ఒక ప్రణాళిక ప్రకారం సాగిపోతున్నది.

చెప్పవలసిన దానిని ఒడుపుగా చెప్పడం, చెప్పదలచిన దానిని గజిబిజి లేకుండా చెప్పటం సరళ సుందరంగా సాగే వీరి రచనలలోని

విశిష్ట లక్షణాలు. తన ప్రతి మాటా, ప్రతి వ్రాతా, ప్రతి చేతా లోకహితం కోసమే అన్న ఆత్మవిశ్వాసం వీరి అనుభూతికి అందుతూ ఉన్నది.

మాస్టర్ ఎం. కె. గారి ద్వారా అందిన సందేశాలు 'పునర్నిర్మాణానికి శంఖారావం' అనే పేరుతో రూపుదిద్దుకొంటున్నవి. ప్రస్తుతం ఇది రెండవ భాగము. ఇందులో 'తరం తరం నిరంతరం మొదలు నేడు కూడా నిలబడగలం' వరకు పదమూడు వ్యాసాలు ఉన్నవి. ఈ వ్యాసాలలో ఎన్నో మంచి సంగతులు వివరింప బడినవి.

అనాదిగా మహర్షుల నుండి ప్రారంభమై, అవతార మూర్తుల మీదుగా ప్రతిష్ట చెందుతూ సాగివస్తున్న సనాతన ధర్మం మాస్టర్ ఇ. కె. ద్వారా సమన్వయింపబడి తరంనుండి తరానికి ఎలా నిరంతరం అందుతూ ఉన్నదో, తరం తరం నిరంతరం వ్యాసంలో మనకు చక్కగా తెలియ వస్తుంది.

ఒకప్పుడు సమాజ అవసరాలకోసం ఏర్పడిన కుల విభాగాల మధ్య విభేదాలు ఏర్పడినవి. ఆ విభేదాలను రాజకీయవాదులు స్వార్థం కోసం పెంచి వాడుకుంటున్నారు. వివేకంతో ఈ కుల ద్వేషాలను తొలగించుకొని విశాల ప్రేమ రాజ్యంలోనికి ప్రవేశించాలి అంటూ అందుకు కావలసిన వెలుగును అందిస్తున్నది 'కులద్వేషం నుండి ప్రేమ రాజ్యానికి' అన్న వ్యాసం.

ఒక కులాన్ని మరొక కులం నశింపవేయాలి అణచివేయాలి అనే తత్త్వంనుండి బయలుపడి సమదర్శనాన్ని దివ్యస్పర్శతో ధర్మస్పర్శలో పెంచుకోవాలి. ఆవిధంగా యువతను తీర్చిదిద్దాలి అన్న అవగాహనను మనకు అందిస్తుంది 'సర్పయాగం నుండి ఆకాశ గంగకు' అన్న వ్యాసం.

చాదస్తం తగ్గించుకొని ఆప్యాయతతో తోటివారిని ఆదరించటం 'మాయ'లో కొట్టుకుపోక, చుట్టూవున్న సమాజం యెడల మన బాధ్యతనూ, కర్తవ్యాన్ని నిర్వహించటం హిందూ సోదరుల ఆచరణలోకి రావాలి అన్న పిలుపు మనకు అందుతుంది "హిందూ సోదరులారా!" అన్న వ్యాసంలో.

తమ గురుదేవులైన ఇ. కె. మాస్టరుగారిని గురించి వ్రాసిన 'నవయుగ ప్రవక్త' అనే వ్యాసం పదిలంగా చదువవలసిన రచన.

మనలోని దైవత్వాన్ని వ్యక్తం కానిచ్చి శాశ్వతమయిన దివ్య సందేశాన్ని అందుకొంటూ ఉంటేనే మనం భవ్యంగా ఉండగలం అని మనలను వెన్ను తడుతున్న వ్యాసం 'నేడు కూడ నిలబడగలం'.

ఇప్పటి పరిస్థితులనూ, సన్నివేశాలనూ ఉటంకిస్తూ పాఠకుల మదిలో ఒక వెలుగునింపే ఈ పుస్తకానికి స్వాగతం పలుకుదాం.

గుంటూరు,
18-12-92.

—పరాశరం గోపాలకృష్ణమూర్తి.

# సందేశాలు - సందర్భాలు

మానవధర్మ శిక్షణ సంస్థ లక్ష్యం జాతి పునర్నిర్మాణం. సారథి శ్రీకృష్ణస్వామినుండి వెలువడుతున్న రచనలన్నీ జాతిని పునర్నిర్మిస్తూ పరిపూర్ణతవైపుగా దానిని నడిపిస్తున్నవే! అయితే ఈ పునర్నిర్మాణానికి శంఖారావం గ్రంథపరంపర జాతి పునర్నిర్మాణాన్నిగూర్చి, సూటిగా ప్రబోధిస్తున్నది. పునర్నిర్మాణానికి కావలసిన ఆత్మపరిశీలనా రూపమయిన విశ్లేషణను, అందుకుగాను మనం అందుకోవలసిన క్రియాశీలమయిన సమన్వయాన్ని విశేషంగా అందిస్తున్నది. లక్ష్యాన్ని స్పష్టంచేస్తూ అందుకు కావలసిన పిలుపును మనకు పెద్ద ఎత్తున అందిస్తున్నది.

పునర్నిర్మాణానికి శంఖారావం మొదటిభాగం 1988 లో వెలువడింది. అప్పటినుండి జాతికి కావలసిన మేలుకొలుపును అది అందిస్తూనే ఉన్నది. ఇప్పుడు రెండవభాగం వెలువడుతున్నది. పునర్నిర్మాణానికై మేలుకొంటున్న జాతిని అందుకు తగిన విధంగా రూపుదిద్దడానికిగాను సమాయత్తమవుతున్నది.

ఈ కృషి ఆగేదికాదు సాగేది అని మనకు తెలియజెప్పే వ్యాసం 'తరం తరం నిరంతరం'. 1991 ఆగస్టు నెలలో జగద్గురు పీఠంనుండి నెల నెల వెలువడే పత్రికలో దర్శనాత్మక మయిన ఈ వ్యాసం ప్రత్యేకంగా వెలువడింది.

1988 చివరలో ఒక ప్రముఖమయిన హత్యజరిగింది. ఈహత్యతో కోస్తాజిల్లాలలో కులద్వేషం ఒక్కసారిగా పెచ్చరిల్లింది. విధ్వంసం అవధులు దాటి విలయతాండవంచేసింది. మనిషి తన ప్రక్క మనిషినే అనుమానంగా చూసేస్థితి ఏర్పడింది. తన నీడను చూసి తాను భయపడే దారుణస్థితి దాపురించింది. ఎవరు ఎవరో ? ఏ క్షణంలో ఎవరు ఎవరిని ఏమిచేస్తారో ! అంతుపట్టని అధ్వాన్నస్థితి అంతటా గోచరించింది.

ఆ పరిస్థితులనుండి సమాజం తేరుకొని దారిని పడేటందుకు వీలుగా శ్రీ కృష్ణస్వామి రెండు ఇంటర్వ్యూల నిచ్చారు. శ్రీ కందర్ప ఈ ఇంటర్వ్యూలకు వ్యాసరూపాన్ని ఇచ్చి పత్రికలకు అందించారు. కులద్వేషం నుండి ప్రేమ రాజ్యానికి అన్న వ్యాసం 1-2-89 న ఉదయం దినపత్రికలో వెలువడింది. సర్పయాగంనుంచి ఆకాశగంగకు అన్న వ్యాసం 8-3-89 న ఆంధ్ర పత్రిక దినపత్రికలో ప్రచురింపబడింది. ఈ రెండు వ్యాసాలూ సమాజాన్ని సేదతీర్చి నిలబెట్టాయి. ఎప్పటికీ అలా నిలబెడతాయి.

హిందూ సోదరులలో నిర్వీర్యస్థితి ఎందుకు పెరుగుతోంది. నిష్క్రియత్వం వీరిని ఎందుకు ఆవహిస్తోంది మొదలయిన ప్రశ్నలకు లోతులను తడిమి జరిగినదేమిటో తెలియ జెప్పారు శ్రీకృష్ణస్వామి. జరుగవలసినదేమిటో ఉపదేశించారు. హిందూసోదరులారా ! అన్న ఈ ఇంటర్వ్యూ 90 ఫిబ్రవరి భారతీయ మార్గం మాస పత్రికలో వచ్చింది. శ్రీ మన్నవ గిరిధరరావు దీనిని నిర్వహించారు.

పల్లెలను కల్పవృక్షాలుగా, అందరికీ ఆవాస విద్యాలయాలు అన్న రెండు వ్యాసాలు శ్రీ కందర్ప నిర్వహించిన మరో రెండు ఇంటర్వ్యూల నుండి రూపుదిద్దుకొన్నవి. ఈ రెండు 91,92 ఉద్యమ సంచికలలో వరుసగా ప్రచురింపబడ్డాయి.

బస్తీలకు రద్దీ పెరుగుతోంది. పల్లెటూళ్ల బోసిపోతున్నాయి. మనం ఎటునుండి ఎటోపోతున్నాం. ఏదో అయిపోతున్నాం. అలాంటి ఈ తరు

ణంలో పల్లెలను కల్పవృక్షాలుగా తీర్చి దిద్దడమే పరిష్కారమని కృష్ణస్వామి చెబుతున్నారు. అలా తీర్చి దిద్దే విధానాన్ని వివరిస్తున్నారు- 'పల్లెలను కల్పవృక్షాలుగా' అన్న వ్యాసంలో.

నేటి విద్యారంగంలోని అవక తవకలన్నింటినీ ఆమూలాగ్రంగా స్పృశిస్తూ వీటిన్నింటికీ పరిష్కారం అందరికీ ఆవాస విద్యాలయాలను అమర్చిపెట్టగలగటమే అంటూ వివరిస్తున్నారు 'అందరికీ ఆవాస విద్యాలయాలు' అన్న వ్యాసంలో.

పరిపూర్ణత వైపుగా, నవయుగ ప్రవక్త, శ్రీ అరవిందుని జన్మదినం, రావాలనీ, వస్తాడనీ - ఈ వ్యాసాలు ఆయా మహనీయుల జన్మదినాల సందర్భంగా వ్యక్తమైనాయి.

మనిషిని దేవునిగా తీర్చిదిద్దే మాస్టరు సి. వి. వి. గారి దివ్య సందేశం పరిపూర్ణత వైపుగా అన్న వ్యాసంలో ఆవిష్కరింపబడింది. 92 ఆగస్టు 4 వ తేదీన ఆంధ్రప్రభ దినపత్రికలో ఇది వెలువడింది.

అలాగే జాతి పునర్నిర్మాణానికై మాస్టర్ ఇ. కె. నిర్వహించిన విశిష్ట కృషికి దర్పణం పడుతున్నది 'నవయుగ ప్రవక్త'. 92 ఆగస్టు 11 వ తేదీన ఆంధ్రప్రభ దినపత్రికలో ఇది ప్రచురింపబడింది.

తన జన్మదినాన భరత మాతకు బానిస శృంఖలాలనుండి విముక్తిని కలిగించిన మహాతపస్వి శ్రీ అరవిందుడు. ఆ మహనీయుని దివ్యజీవన వైఖరులను తెలియచెప్పే వ్యాసమే 'శ్రీ అరవిందుని జన్మదినం'. 92 ఆగస్టు 15 వ తేదీన శ్రీకృష్ణస్వామి నుండి వెలువడిన దివ్యసందేశమే ఈవ్యాసం.

ఇక రావాలనీ వస్తాడన్న అనుభూతి ప్రదమయిన వ్యాసం శ్రీ కష్ణాష్టమి సందర్భంగా వెలుగుల లోకాలనుండి వెలువరింపబడింది. 92 ఆగస్టు 21 న ఆంధ్రప్రభ దినపత్రికలో ఇది దర్శనమిచ్చింది.

నాటినుండి నేటివరకు,ఆస్తికభూమికి వారసులం, నేడుకూడ నిలబడగలం - ఈ వ్యాసాలు ప్రత్యేక సంచికలకుగాను ప్రత్యేకంగా అందజేయబడినవి.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి శతజయంతి సంచికకు అందించబడింపే 'నాటినుండి నేటివరకు' అన్న వ్యాసం - భారత గాథను ఆధారంగా చేసికొని నేటి భారతానికి పథ నిర్దేశం చేస్తున్నారు స్వామి ఇందులో!

ఆస్తిక భూమి మాసపత్రిక కృష్ణా పుష్కరాల సందర్భంగా ఒక ప్రత్యేక సంచికను వెలువరించింది. దానికి అందించబడిన వ్యాసమే 'ఆస్తిక భూమికి వారసులం' అన్నది. ఈ ఆస్తిక భూమికి వారసులమై నిలబడేటందుకుగాను మనం ఎలా ప్రవర్తించవలసి ఉన్నదీ ప్రబోధాత్మకంగా వివరిస్తున్నారు స్వామి ఈ వ్యాసంలో.

గుంటూరు జిల్లాలో సంగం జాగర్లమూడి అనే ఒక గ్రామం ఉన్నది. ఆ గ్రామంలో 92 ఏళ్ల పండువృద్ధురాలు ఉంది. ఆమె పేరు కాకాని రంగమ్మ. గీతామందిరాన్ని ఒకదాన్ని నెలకొల్పి ఆ ప్రాంతవాసులందరినీ జాగృతం చేస్తూ వస్తున్నదామె. ఆ గీతామందిరానికి రజతోత్సవ సమయం వచ్చింది. ఆ సందర్భంగా ఒక ప్రత్యేక సంచికను వెలువరించడం జరిగింది. ఆ సంచికకుగాను స్వామి ఇచ్చిన దివ్య సందేశమే 'నేడుకూడ నిలబడగలం' అని. ఆ నిలబడటానికి కావలసిన ప్రబోధనాన్ని స్వామి ఈ వ్యాసంలో అందిస్తున్నారు. ఈ వ్యాసం దగ్గరకు వచ్చేటప్పటికి చదువరులమయిన మనకుకూడ అనిపిస్తుంది నేడుకూడ నిలబడగలంఅని.

ఈ గ్రంథానికి ఫలశ్రుతి ఇదే! నేడు కూడ నిలబడగలం అని మనకు నిజంగా తెలిసి నిండుగా మనం నిలబడగలగడమే!

విజయవాడ

19-12-92

మంత్రి
ప్రచురణ విభాగం

# తరం తరం – నిరంతరం

1987 లో అనుకొంటాను. కోడూరులోని ప్రార్థనా సంఘం వారు, వారి వార్షికోత్సవాల సందర్భంగా కనీసం ఒక వారంరోజుల పాటు ప్రవచనం చేయమని నన్ను కోరారు. అప్పటి పరిస్థితులను బట్టి నాకంతటి అవకాశం లేదు. వారికొక ఉత్తరం వ్రాశాను. 'నేను రాలేకపోతున్నాను. అలాగని పూర్తిగా మానను. చివరి రోజున ముగింపు సభకు వస్తాను. ఈ కార్యక్రమానికి మీకు తగిన వ్యక్తి లభిస్తారు. కార్యక్రమం దిగ్విజయంగా నడుస్తుంది' అని.

చివరి రోజున వెళ్ళాను. ఎందరెందరో నన్ను కలుసుకోవడానికని వచ్చారు. వచ్చిన ప్రతివారు 'మీరు వస్తారని అనుకొన్నాం. మీరు రాలేదు. ఎవరో పెద్దలు వచ్చారు. వారూ బాగానే చెబుతున్నారు. ఆశ్చర్యం ఏమిటంటే వారు ప్రవచనం చేస్తున్నంతసేపూ పదిహేను నిముషాలకొకసారయినా కృష్ణమాచార్యుల వారి ప్రసక్తి తెస్తున్నారు! మాకాశ్చర్యమనిపించింది! మీరు రావాలనుకొన్నాం, వారు వచ్చారు. కానీ అదే గురుస్మరణ! అవే విశేషాలు! మీరు వచ్చినట్లే అనిపించింది మాకు.' అంటూ మురిసిపోయారు.

కార్యక్రమం కాసేపట్లో ప్రారంభం కాబోతోంది. సభా ప్రాంగణంలో నేను ఒక ప్రక్కగా కూర్చొని ఉన్నాను. ఇంతలో ఒకాయన,

కాషాయ వస్త్రధారి చిరునవ్వుతో గబగబా నా వైపుకు వస్తున్నారు. ఆయన మధుసూదన సరస్వతి. అన్నాళ్లూ అక్కడ ప్రవచనం చేసింది ఆయనే. స్వామి చిన్మయానంద సంప్రదాయంలో ప్రత్యేకమైన తర్ఫీదు పొందిన వారు. వచ్చి నా ప్రక్కన కూర్చొన్నారు. కూర్చుని ఇలా అన్నారు: 'మిమ్మల్ని చూడగలగడం ఒక అదృష్ట విశేషం. కృష్ణమాచార్యుల వారిని చూస్తున్నట్లే ఉన్నది నాకు. నేను వారి గ్రంథాలన్నీ చదివాను. చదువుతున్నాను. చదువుతూనే ఉంటాను. ఆ భాగవత రహస్య ప్రకాశ రచన అపూర్వం! వారి నవలా రచన అపురూపం! ఒక్కమాటలో చెప్పాలీ అంటే, వారు ఈ ఆధునికయుగంలో వెలసిన జనక మహారాజు. మహర్షులయిన వారు తమ దగ్గర తయారయిన శిష్యులను, వారికి కావలసిన సమన్వయం అందడం కోసం, జనక మహారాజు దగ్గరకు కోరి పంపేవారట, అలాగే, ఈ ఆధునిక యుగంలో ఏ ఆధ్యాత్మిక సంప్రదాయంలో తయారయిన వారయినా, నిత్యజీవిత నిర్వహణలో కావలసిన సమన్వయాన్ని పొందడంకోసం ఇ. కె. మాస్టరుగారి వెలుగును సమీపించవలసిందే! కనుకనే సందర్భం వచ్చినప్పుడల్లా నా ప్రసంగాలలో వారిప్రసక్తి వస్తూనే ఉంటుంది. ప్రజలకు ఆ సందేశం, ఆ సమన్వయం అందుతూనే ఉంటాయి.

'అన్నట్లు ఆ పురుష మేధంలో జ్వాలాకూలుడూ, జైమినీ కలసి చేసిన ఆకాశయానాన్ని వారు వర్ణించిన తీరు ఉన్నదే, అది కాళిదాసును తలపిస్తూ ఉన్నది. ఇంకా చెప్పాలీ అంటే కాళిదాసును పూరిస్తూ ఉన్నది. కాళిదాసు ఆకాశయానంలో దిగువగా కనబడే ఉత్తర దేశాన్ని వర్ణింపగా. ఆచార్యుల వారు, అదే ఆకాశయానంలోనుండి చూసినప్పుడు దక్షిణదేశం ఎలా కనబడుతున్నదీ వర్ణించారు. కాళిదాసును తలపించారు, మరపించారు. ఇక ఆ నవలల్లో వారు ఆవిష్కరించిన కృష్ణతత్త్వమున్నదే - అది అనుభవించి తీరవలసిందే!

నేను మీ గ్రంథాలూ చదివాను. భారతం - ధర్మాద్వైతం కూడా చదివాను. మీ రచనలు చదువుతూ ఉన్నప్పుడు నాకు ఒక ఆశ్చర్యం కలిగింది. సామాన్యంగా పెద్దలకు దగ్గరయిన వారు, వారి ప్రభావానికి లోనవుతారు. అన్నిటా వారిని అనుకరిస్తారు. మీ విషయంలో అలా జరగలేదు. మీరు వారి ప్రభావానికి లోనయ్యారు. దానిని మీదయిన బాణీ లోనికి మీరు మలచుకొన్నారు. వారి హృదయాన్నీ, సందేశాన్నీ నిండుగా స్వీకరించారు. మీదయిన తరహాలో దానిని మేళవించుకొన్నారు. ఇలా జరగడం అవసరం. అప్పుడే కథ ముందుకు సాగుతుంది. అలాకాక, ఆ అనుకరణలోనే శిష్యుడు ఉంటే, కథ అక్కడే ఆగుతుంది. ఆచార్యుల వారు ఈ విషయంలో ఘన విజయాన్ని సాధించారు. శిష్యులు తమ తమ తరహాలలో ఈ కథను కొనసాగించేటట్లుగా దివ్యమయిన దోహదాన్ని అందచేసారాయన. ఇదంతా ఈ జాతి అదృష్టం!'

వారలా మాట్లాడుతూ ఉంటే నాకు ఎనలేని ఆనందం కలుగు తోంది. సంసిద్ధత కలిగిన ప్రతివారినీ ఆయన ఎలా అనుగ్రహిస్తూ సాగు తున్నారో బోధపడసాగింది. 'అవును ఆయన అక్షర పురుషుడు. ఆ రచన లలో ఏ అక్షరం నుండయినా ఆయన పొడగట్టగలడు.' అనిపించింది.

* * *

తెనాలిలో హోమియో శిక్షణ తరగతులకు ఇంటర్వ్యూ నిర్వహింప బడుతోంది. ఒకరి తరువాత ఒకరు పరిచయమై వెళుతున్నారు. ఒకాయన వచ్చారు. నడివయస్సులో ఉన్నారు. ఆధునిక పద్ధతులలో పెద్ద ఎత్తున వ్యవసాయాన్ని నిర్వహిస్తున్నారట. మాటల మధ్యలో, 'నేను గుంటూరు హిందూకాలేజీలో కృష్ణమాచార్య దగ్గర చదువుకొన్నానండీ' అన్నారు. నా గుండె ఝల్లుమంది. ఆయన ముఖంలో తృప్తి నిండి ఉంది.

ఆయన ఇంకా ఇలా చెప్పారు: 'ఆ రోజులలో ఒక విశేషం జరిగేది. మిగతా ఉపాధ్యాయులంతా ఎవరి క్లాసు వారు చెప్పుకొనేవారు. కృష్ణమాచార్యగారు ఏ క్లాసులో ఏ పాఠం చెబుతున్నా అవకాశం ఉన్న అన్ని క్లాసులవాళ్ళూ అక్కడ చేరుతూ ఉండేవారు. అలా చేరుతూ ఉండే వారిలో నేనూ ఒకణ్ణి. అవకాశం ఉన్నంతవరకు ఆయన క్లాసు ఎక్కడ జరుగుతూవుంటే అక్కడ చేరుతూ ఉండేవాళ్ళం. అందుకుగాను, మాకు ఆయన పర్మిషనుండేది'.

ఆయన ముఖం తృప్తితో వెలిగిపోతోంది. అలనాటి ఆ దృశ్యాలలో నుండి ఆయన మాట్లాడుతున్నట్లు స్పష్టమవుతోంది.

మనకు వారి మలివాక్కులే తెలుసు. ఆ చెప్పబడుతున్నది వారి తొలి వాక్కుల వైభవం. నా మనస్సు మురిసిపోయింది. నా హృదయం ఉప్పొంగిపోయింది. అలనాటి ఆ దృశ్యాలు అలా అలా లీలగా నా ఎదుట గోచరించసాగాయి.

ఆ గొంతుకు ఉన్న వైభవం అలాంటిది. ఒక విద్యాలయం నుండి వెలువడినా, ఒక జగద్గురు పీఠంనుండి వెలువడినా దాని వైభవం దాని వైభవమే! అది ఎప్పుడూ గుర్తింపబడుతూనే ఉంటుంది. ఎల్లరిచేతా ఆరాధింపబడుతూనే ఉంటుంది. అందరినీ అది పరవశింపచేస్తూనే ఉంటుంది.

అప్పటికి జ్వరం పడి లేచి ఉన్నాను. బాగా నీరసంగా ఉంది. సాంబశివరావుగారు ఈ ప్రస్తావన తెచ్చేటప్పటికి ఇక ఆ నీరసం ఎక్కడికి పోయిందో దానికే తెలియాలి.

* * *

రాత్రి అవుతోంది. చీకటి చిక్కబడుతోంది. బెజవాడలోని సంస్థ కార్యాలయంలో ముందు గదిలో కూర్చొని పనిచేసికొంటున్నాను. పూజ్యులు క్రొత్త రామకోటయ్యగారి పెద్దబ్బాయి సుబ్బారావు వచ్చాడు.

విశేషాలన్నీ చెబుతున్నాడు. అతనేం చెబుతున్నా, ఆ చెప్పేటప్పుడు అతని గుండె ఆ గొంతులో పలుకుతుంది. అందుకని నాకు చాలా హాయిగా ఉంటుంది అతనితో మాట్లాడుతూ ఉంటే. మాటల మధ్యలో అతడన్నాడు కదా, 'నేనూ ఇ.కె. మాస్టరుగారి స్టూడెంటునేనండీ' అని. నాకాశ్చర్యం వేసింది. నేనంతవరకూ వినలేదా మాట. 'నీవూ, ఆయన విద్యార్థివేనా! బలేగా ఉందే!' అన్నాను. ఆనందిస్తూ అలా కూర్చున్నాను.

అతడిలా చెప్పసాగాడు: నేను గుంటూరు హిందూ కాలేజీలో వారి విద్యార్థిని. క్లాసులతో సరిపెట్టుకోకుండా, వారి గీతా ప్రవచనాలకు కూడా వెళ్ళేవాడిని. వారి గీతా ప్రవచనం-అదొక దివ్యానుభూతి. ప్రవచనం జరుగుతూ ఉండగా, ఒకరోజు వారి నోటినుండి మాస్టరు సి.వి.వి.గారి ప్రసక్తి వచ్చింది. నాకు ఆశ్చర్యానందాలు కలిగాయి. మేము అప్పటికే నాన్నగారి ద్వారా సి.వి.వి గారి సంప్రదాయంలో నడుస్తున్న వాళ్ళం. ఇ.కె. మాస్టరు గారు కూడా సి.వి.వి. గారి సంప్రదాయానికి చెందినవారే అని తెలిసేటప్పటికి నేను ఆనందాన్ని పట్టలేకపోయాను.

ఇంటికి వెళ్ళినప్పుడు మా నాన్నగారికి చెప్పాను. మా 'ఉపాధ్యాయుల్లో కృష్ణమాచార్య గారని ఒక ప్రత్యేకమయిన వ్యక్తి ఉన్నారు. వారు కూడా మన సి.వి.వి. మాస్టరుగారి సంప్రదాయానికి చెందినవారట.' అని.

'ఆహా! అలాగా!' అన్నారు నాన్నగారు. ఇ.కె. మాస్టరుగారి ప్రసక్తిని నాన్నగారు మొదట విన్నదీ అప్పుడే! తర్వాత చాలా కథ జరిగిందనుకోండి.

సుబ్బారావు కళ్ళల్లో పారవశ్యం తొంగిచూస్తోంది. నా మనస్సు దివ్యమయిన పులకింతను అనుభవిస్తూ ఉన్నది. ఎక్కడనుండి ఎక్కడకు

అనుసంధానం! ఈ కొడుకువెళ్ళి ఆ తండ్రికి చెప్పాడు! ఆ తరువాతి కాలంలో ఆ తండ్రివచ్చి 'ప్రభాకర శాస్త్రిగారి అడ్రెస్సు మాకు ఇక్కడ దొరికింది.' అంటూ. ఇ.కె. మాస్టరుగారి పాదాలపై వ్రాలి పరవశించి పోయారు! ఎక్కడి నుండి ఎక్కడికి!

* * *

ఉదయం పది గంటలవుతోంది. నడివయస్కుడు ఒకడు తన మేన మామగారి ద్వారా బెజవాడలోని కార్యాలయం అడ్రెస్సును పట్టుకొని మరీ వచ్చాడు· 'నా పేరు తేజం అండీ. నేనిప్పుడు అమేథీలో ఉంటున్నాను. మీ అడ్రెస్సును ఇప్పటికి పొందగలిగాను. మిమ్మల్ని చూడాలనీ, ఇటీవల మీరు రచించిన గ్రంథాలను తీసికొని వెళ్ళాలనీ వచ్చాను నేను.' అంటూ తనను తాను పరిచయం చేసుకొన్నాడు. అతణ్ని ఎక్కడో చూసినట్లుంది. తర్వాత గుర్తొచ్చింది. సింహాచలంలో గురుపూజా వేదిక దగ్గర సంవత్స రాల తరబడి అతడిని చూసానూ' అని. మాస్టరుగారి ప్రవచనాలను ప్రత్యేకమయిన శ్రద్ధతో టేప్‌చేస్తూ ఉండేవాడితను.

ఇష్టాగోష్ఠి నడుస్తోంది. మధ్యలో అతడన్నాడు కదా-నేను ఇంతకు పూర్వం హైద్రాబాదు H.A.L. లో పనిచేసే వాణ్నండీ. అప్పుడే నాకు జగన్మోహనరావుగారి పరిచయం. నేనూ, మా ఆవిడా కూడా ఆయన దగ్గర హోమియో నేర్చుకొన్నాం. వారి ద్వారానే ఇ. కె. మాస్టరుగారికి దగ్గ రయ్యాం. హైదరాబాదులో ఉన్నంత కాలం H.A.L. కాలనీలోని మన డిస్పెన్సరీలో పనిచేసాం. ఇప్పుడు అమేథీలో ఆ సేవను కొనసాగి స్తున్నాం' అని.

అతని ముఖం వికసించి, వెలుగుతోంది.

బాగుంది! తాను వెలుగును పొందాడు. పదిమందికి పంచిపెడు తున్నాడు. అతని పూర్తిపేరు 'ఆంధ్రతేజం' అట! ఆంధ్రుల తేజం అమేధీ వరకూ చేరుకొన్నది' అనిపించింది.

ఈ కథ ఆగేదికాదు, ముందుకు సాగేది. రాష్ట్రంనుండి రాష్ట్రానికీ, దేశం నుండి దేశానికీ, తరంనుండి తరానికి నిరంతరం ఇది సాగిపోతూనే ఉంటుంది. ఆ రచన అటువంటిది! ఆ వాక్కు అటువంటిది! ఆ సంకల్పం అటువంటిది! ఆ సేవ అంతటిది!



# కుల ద్వేషం నుండి ప్రేమ రాజ్యానికి

వర్ణం కాని, కులం కాని మొదట సామాజిక సౌకర్యం కోసమే ఏర్పడినాయి. వాటి దుర్వినియోగం ద్వారానే తరువాత విషమ పరిస్థితులను మానవుడు సృష్టించుకొంటున్నాడు.

అసలు వర్ణం వేరు, కులం వేరు, వర్ణం ప్రవృత్తిని బట్టి ఏర్పడినట్టిది. వర్ణ ధర్మాలు సృష్టి అంతటిలో వ్యాపించివున్నవే. గ్రహాలలో, ఖనిజాలలో జంతుజాతులలో, మానవులలో వర్తిస్తున్నదే ఈ ధర్మం. పెద్దల వెలుగులో మన ప్రవృత్తిని తెలుసుకొని, తద్వారా మన జన్మలను సార్థకం చేసుకోవడానికే ఈ వర్ణ ధర్మం! గురుకులాల్లో గురువు ద్వారా ఆ ప్రవృత్తి తెలిసేది. ప్రవృత్తులు ప్రధానంగా నాలుగు- శిక్షణ, రక్షణ, పోషణ, పరిచర్య.

ఇలా ప్రవృత్తినిబట్టి పని ఎంచుకొనకపోతే, ఇవ్వకపోతే నష్టం జరుగుతుంది. ఉదాహరణకు కోస్తాలో మొన్నటి పోలీసు వైఫల్యాన్నే తీసుకోవచ్చు. క్షత్రియ ధర్మం ఉన్న వ్యక్తిని పోలీసుగా నియమిస్తే తాను పోనన్నా పోతాడు కాని ఈ నష్టం జరగనివ్వడు. కనుక చిన్నతనం లోనే వ్యక్తి ప్రవృత్తిని గమనించి, అందుకు తగిన శిక్షణ యిచ్చి, అందుకు అనుగుణంగా సమాజం అతడిని వినియోగించుకోవాలి.

మరో ఉదాహరణ. పాములలో దేవతా సర్పాలు ఉంటాయి. వంశాలను రక్షించే క్షత్రియ ధర్మంగల పాములు ఉంటాయి. పాదరసం వైశ్య

ధర్మంగల లోహం. బంగారానిది బ్రాహ్మణ ధర్మం. ఇనుముది శూద్ర ధర్మం. వెండిది క్షత్రియ ధర్మం.

కాగా మానవులలో ఈ వర్ణ నిర్ణయం కేవలం జన్మనుబట్టి సాధ్య పడదు. గుణ కర్మలను బట్టి నిర్ణయించాలి. భారతంలో ధర్మరాజు పామై పడివున్న నహుషునితో అంటాడు. 'బ్రహ్మనుంచి నాలుగు వర్ణాలు దిగి వచ్చినట్లు ఒకే దంపతుల నుండి నాలుగు వర్ణాల బిడ్డలూ ఎందుకు పుట్ట కూడదు!' అని, పుట్టడానికి పూర్తి అవకాశం ఉన్నది. కనుకనే శ్రీకృష్ణుడు 'గుణకర్మ విభాగశః' అన్నాడు. అది నీవు చేసే విభాగం కాదు. గుణ కర్మల చేత నిర్ణయ మయ్యేది.

ఎందుకంటే పరాశరుడు బ్రాహ్మణుడు, సత్యవతి క్షత్రియ వనిత. వారిద్దరికీ జన్మించిన వ్యాసుడు, మహర్షి అయినాడు. అతడు అంబిక అంబా లికలకు ధృతరాష్ట్రుడు, పాండురాజు అనే క్షత్రియులను అనుగ్రహించాడు, వారు అడిగిన మేరకు. వ్యాసమహర్షి వర్ణాన్ని గుణకర్మలను బట్టి నిర్ణయిం చాం, తల్లిదండ్రులను బట్టి కాదు. అలాగే, పండిన దివ్యజ్ఞానాన్ని బట్టి వాల్మీకి మహర్షి అయినాడు.

ఇప్పుడు ఇతర దేశాలలో ప్రవృత్తులను గుర్తించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఒక మిషన్‌లో వేలుపెడితే, తెరమీద ఒక లైటు వెలుగు తుంది. అతడు మెడిసిన్ సీటుకోసం వచ్చాడనుకోండి. 'నీ 'ఆరా'లో లవ్ మోటివ్, సర్వీస్ మోటివ్ తక్కువగా వున్నాయి. నీవు మెడికల్ ఫీల్డుకు తగవు' అని చెబుతున్నారు. ఇరవై ఏళ్ళ తర్వాత మనం ఆ మిషన్‌లను ఎలాగూ తెచ్చుకొంటాం పాశ్చాత్యులనుండి.

పైగా ఈ విభాగంలో ఎక్కువ, తక్కువల ప్రసక్తి లేదని మన పూర్వులు స్పష్టంగా చెప్పారు. ఇది శ్రమ విభజన. మనం వలంటీర్లం

మాత్రమే. ఈ విభాగం ఈ జన్మకు పరిమితం. అది కూడా మనకు ఆసక్తి ఉన్నంత వరకే. భీష్ముడు క్షత్రియుడుగా బ్రతికి, చివరి క్షణాల్లో బ్రహ్మర్షిగా ఎదిగాడు.

ఇక కులాలు వృత్తినిబట్టి ఏర్పడినవి. ఒక్కొక్క వృత్తికి ఒక్కొక్క కులం, ఒక్కొక్క వాడ. సాలెవీధి, కుమ్మరివీధి.

ఇలా ఇది విడదీయడం కాదా అని మనకు ఇప్పుడు అనిపించవచ్చు. కానేకాదు. పరస్పర సహకారానికే ఈ ఏర్పాటు. రెండవది, ఒక పని చేసే వారికి సాధారణంగా ఒకే విధమైన భాష, ఆహార విహారాలు, ఆచార వ్యవహారాలు రూపుదిద్దుకుంటాయి. వాళ్ళ కట్టుబాట్లకు తగిన విధంగా వారు ఆ వీధిని, ఆ వాడను నడుపుకుంటారు. స్వంత వ్యక్తిత్వం, స్వేచ్ఛ వాళ్ళకుంటాయి.

అలాగే- కులంలోనే వివాహం అనే శాస్త్రీయ అంశాన్ని మన పెద్దలు ప్రవేశపెట్టారు. అలా జరిగితే ఆ పని క్రమంగా రక్తనిష్ఠఅయి, వారికి పుట్టిన బిడ్డకు కూడా రక్తనిష్ఠమై ఆ విద్య వస్తుంది. ఇందులో 'బోర్న్ ఎంప్లాయ్‌మెంటు' ఉంది. అతడు ఆ పని చేయడానికి పుట్టాడు. కనుక అతనికి దానిలో అభిరుచి, అభిమానం ఉంటాయి. ఆ పని అతని యందు ప్రవర్తిస్తుంది. మిమ్మల్ని ఉద్యోగాల్ని అడగవలసిన దుస్థితి అతడికి పట్టదు. వంద ఏళ్ళ క్రితం నిరుద్యోగం ఎందుకు లేదు ?

రెండవ సౌకర్యం, భార్యాభర్తలు ఆ పని కలసి చేసుకుంటారు. సాల్ పనిచేసే అమ్మాయివస్తే దారం చక్కగా తీసిపెడుతుంది. మరో కులం అమ్మాయి అయితే ఆ దారం తెగగొడుతుంది. అతడి జీవితంలో సహకారం, అతడి బిడ్డకు అర్హత లభిస్తాయి.

అయితే లక్షల సంవత్సరాలుగా వస్తున్న ఈ వ్యవస్థ అవ్యవస్థ అయింది. ప్రాచీన వ్యవస్థల మూలాలు కదిలాయి. అందులో కొంత మంచి,

కొంతచెడూ వచ్చింది. పారిశ్రామికీకరణవల్ల ఈబాటలో ఒక చిత్రమైన అప శ్రుతి వచ్చింది. పారిశ్రామికీకరణ జరుగకూడదనికాదు, కాని కనీసంపికులా నికి సంబంధించిన పరిశ్రమలలో ఆ కులం వారిని తీసుకున్నా బాగుండేది. అదీ జరగలేదు. అందరినీ తీసుకున్నారు. ఆ కుల వృత్తుల వారు బడుగు జీవులుగా మిగిలిపోయారు. లేదా పారిశ్రామికీకరణను అదుపులోపెట్టి, ఈ వృత్తి విద్యలకే శాస్త్రీయ విజ్ఞానాన్ని జోడించి, వాళ్ళ ఇళ్ళ కదల కుండా, మరింత చక్కగా ఎక్కువ పనిచేసి ఎక్కువ సంపాదించుకొనేటట్లు చేస్తే ఇంకా బాగుండేది. జపాన్ వాళ్ళలా మనం ఒక పెద్ద పరిశ్రమను చిన్న పరిశ్రమలుగా విభజించ లేకపోయాం. ఇవాళ వాళ్ళ ఆర్థికంగా ప్రపంచాన్ని ఏలుతున్నారు.

మనం అనుసరించిన పారిశ్రామికీకరణ పద్ధతివల్ల, విద్యావిధానం వల్ల మరో పరిణామం వచ్చింది. 'వైట్ కాలర్డ్ లైఫ్'పై జిజ్ఞాస ఏర్ప డింది. గుమాస్తా ఉద్యోగంమీద వ్యామోహం పెరిగింది. వృత్తి విద్యలను వదిలేస్థితి వచ్చింది.

మూడవది: ఈ వృత్తి విద్యలలో ఉన్న కొందరిని, మరికొందరు చిన్నచూపు చూడడం జరిగింది. నిజానికి ఏ వృత్తి లేకపోయినా సమాజానికి నష్టమే. ఇందులో ఒకరు ఎక్కువకాదు, ఒకరు తక్కువకాదు. కానీ ఆ చిన్నచూపు చూడబడినవాడు ఎక్కువకాలం ఆ పనిలో ఉండడు. మన సమాజంలో జరిగిన పొరపాటు అదే. ఆ మేరకు అసౌకర్యాన్ని, శిక్షనూ సమాజం అనుభవించక తప్పదు.

నాల్గవది: శ్రమించే లక్షణం కొరవడడం.

అయిదవది: బాధ్యతను స్వీకరించడానికి భయపడే లక్షణంకూడా అబ్బింది.

ఇన్ని లక్షణాలు కలసి ఒకవ్యవస్థను అవస్థపాలు చేశాయి. లక్షలు, కోట్లమీద నిరుద్యోగులు మిగిలి పోయారు. బి. ఏ. లు, ఎం. ఏ.లు ప్యాసయి కోళ్ళఫారాలు, డైరీ ఫారాలు పెడుతున్నారు.

మరి ఎలక్ట్రానిక్స్ వంటివి వస్తున్నవి కదా అని అడగవచ్చు. అవి కూడా క్రొత్త వృత్తి విద్యలు. వాటిని నిర్వహించేవారు ఒక వృత్తిగా స్థిరపడతారు. వారు ఒక కులం అవుతారు. డిగ్రీకన్నా నైపుణ్యం ముఖ్యం కనుక ప్రజలకు డిగ్రీల మీద వ్యామోహం తగ్గాలి. ఇప్పటికే మనం ఎల్. ఐ. సి. కాలనీలు, బ్యాంకు కాలనీలు నిర్మిస్తున్నాం. డాక్టర్ మరో డాక్టర్‌ను, టీచర్ మరో టీచర్‌ను పెళ్ళి చేసుకొంటున్నారు.

అయితే పారిశ్రామికీకరణ ఫలితంగా వచ్చిన మార్పులవల్ల, సమాజంలో ఏర్పడిన ఎగుడుదిగుడుల వల్ల, చిన్న, పెద్ద చూపులవల్ల వృత్తి విద్యలు దెబ్బతిని కులాలు పోయాయి. కుల తత్త్వాలు మిగిలాయి. భౌతికంగా కులాలు ఎక్కడున్నాయి? ఆ పని అతడు చేస్తూ ఉంటే కదా అతడు ఆ కులానికి చెందుతాడు. ఆ పని చేయకపోతే అతడు ఆ కులానికి దూరమైనట్టే కదా! ఇవాళ బస్తీలలో, విశ్వవిద్యాలయాలలో ఉన్నవారు ఆ పనులు చేయడంలేదు. కాని, ఆ కులం పేరు చెపుతున్నారు. కుల వృత్తులు పోయి, కులతత్త్వం ప్రబలుతున్నది.

సమాజంలో ఇంతటి దూరాలు, ఇంతటి కులతత్వాలు ఎందుకు పెరిగాయి? రాజకీయం, కులం ముసుగులో ప్రవేశించడమే ప్రధాన కారణం. రెండు ద్రోహాలు జరిగాయి. ఛాదస్తులు సమాజంలోని సమతూకాన్ని చెడగొట్టడం మొదటి పాపం. రాజకీయ వాదులు కులాల ముసుగులో గ్రామ సీమలలో చిచ్చుపెట్టడం రెండవది. ఛాదస్తంవల్ల ఏర్పడినట్టిది రాజకీయం వల్ల విజృంభించింది. కారణం స్పష్టమే! సామర్థ్యం, గుణగణాలు ఉన్న నాయకులు తగ్గిపోయారు. నేలబారు నాయకులు వచ్చేశారు. వీళ్ళను గెలి

పించుకోవడానికి ఇంకే మార్గం కనిపించక పోయే సరికి కులం చూపించారు. కులతత్త్వాన్ని రెచ్చగొట్టారు. కులతత్త్వం ఒక మహమ్మారిగా తయారైంది. కులం ప్రాతిపదికపై అభ్యర్థులను ఎంపిక చేస్తున్నారు. అందువల్ల సమాజమూ పాడయింది. రాజకీయానికి నాణ్యత తగ్గింది. కులం, ధనం తప్ప మరోటి కనబడడంలేదు.

అయితే పల్లెసీమలు బస్తీలంత చెడిపోలేదనిపిస్తున్నది. ఎన్నికల తర్వాత గ్రామాలలో కక్షలు సద్దుమణుగుతాయి. కానీ, ఉద్యోగులలో, యూనివర్శిటీలలో నిరంతరం ఉంటున్నది ఈ కులతత్వం.

ఇలా కులతత్త్వం పెరిగిపోవడంతో ప్రభుత్వం పాత్ర కూడా ఉన్నది. వెనుకబడిన కులాల తరగతుల జన సంఖ్యను దృష్టిలో పెట్టుకొని, వాళ్ళ ఓట్లకోసం వారికి మరిన్ని అవకాశాలు ఇవ్వాలనే నినాదం లేవదీశారు రాజకీయ నాయకులు. ఆ వర్గాలకు మరిన్ని అవకాశాలు ఇవ్వడం ఎంతైనా అవసరం. కానీ, ఇక్కడ ప్రభుత్వానికి చిత్తశుద్ధిలేదు. చిత్తశుద్ధి ఉంటే, ఇచ్చిన అవకాశాలు సద్వినియోగం అవుతున్నాయో లేదో నిరంతరం పరిశీలిస్తారు. సద్వినియోగం అయ్యేటట్లు చూస్తారు. కానీ ఇవాళ ఆ పరిశీలన లేదు. ఆ కృషి లేదు. అవకాశాలు ఇచ్చి చేతులు దులుపుకుంటున్నారు. సామాజికంగా, ఆర్థికంగా, విద్వత్తుపరంగా, సమర్థులుగా వారిని తీర్చిదిద్దే శిక్షణ కార్యక్రమాన్ని రూపొందించకుండా అవకాశాలను ఇస్తే ఏమవుతుంది ? అర్హతను పెంచకుండా అవకాశాలు ఇస్తే ఏమవుతుంది ?

రెండవది కొందరిని తక్కువగా చూడగూడదని చెపుతూనే, సామర్థ్యంఉన్న మరికొందరిని తక్కువ చూపు చూడడం మొదలుపెట్టాం. అలా మళ్ళీ అదే తప్పు చేస్తున్నాం.

అర్హతను పెంచుకోవడానికి అందరికీ అవకాశాలు ఇవ్వాలి. వెనుకబడిన వారికి మరిన్ని అవకాశాలు ఇవ్వాలి. కాని-అధికారాన్ని మాత్రం అర్హతను బట్టి ఇవ్వాలి, లేకపోతే జాతి శ్రేయస్సు కుంటుపడుతుంది. ముమ్ముందు మనం నష్టపోతాం.

ప్రభుత్వం అవకాశాలు కల్పించింది కాని, వాటిని సామాజిక స్రవంతిలో కలపడానికి ఏమి ప్రయత్నం చేసింది ? గాంధీగారు ఆ పని చేసారు, అది అక్కడే ఆగిపోయింది. ఇటు చాదస్తుల మనస్సులలో పరివర్తన తెస్తూ, అటు అట్టడుగు ప్రజలకు చేయూత ఇచ్చే ప్రయత్నాన్ని మనం ఎందుకు కొనసాగించలేదు? ఆ ప్రయత్న లోపం కూడా కులతత్త్వానికి దారులు వేసింది. ప్రభుత్వం ఆ పని చేయదు. చేసేవారికి ప్రోత్సాహం ఇవ్వదు. వినోభా, జయప్రకాశ్ వంటి మహానుభావులను మనం ఎంతవరకు ఉపయోగించుకున్నాం ? మానసిక పరివర్తన రాకుండా ఆర్థికమైనవి ఎంత పెరిగినా ఏమి ప్రయోజనం ? ఇవాళ బస్తీలలో ఒక్కో కులానికి ఒక్కో కాలేజీ పెట్టుకొనే స్థితి వచ్చేసింది.

కనుక ప్రజలలో నిజంగా చైతన్యం రావాలి. కులప్రాతిపదికపై అభ్యర్థులను నిలబెట్టకుండా వారు రాజకీయ పక్షాలను నివారించగలగాలి. సమర్థుడైనవాడే మనకు కావాలి. మన కులస్థుడైతే ప్రయోజనం ఏమిటి ? అనే ఆలోచన ప్రజలలో రావాలి. అప్పుడు కులతత్త్వాలు అదుపులోకి వస్తాయి.

ఈ రాజకీయాలు ప్రవేశించకముందు పల్లెసీమలు ఒక కుటుంబంగా జీవించాయి. రచ్చబండ మీద అన్ని కులాల పెద్దలూ కూర్చునేవారు. అందరూ వావి వరుసలు పెట్టి పిలుచుకొనేవాళ్లు. ఎవరైనా ఊరు వదలిపోతానంటే, గ్రామ పెద్దలు అడ్డుపడేవాళ్ళు. అందరి మధ్యా బంధుత్వాలే, అనురాగమే, ఆత్మీయతే ఉండేవి.

ఆ రోజులు ఎందుకు పోయాయి ? చాదస్తులు, పదవీ రాజకీయాలు అందుకు కారణాలు. శంకరాచార్యుల వారు చండాలుడిని చూచి, అతనిలో శివసాక్షాత్కారాన్ని పొంది, స్తోత్రం చేశారని చెప్పుకొంటాం. మరి ఆ తర్వాత కూడా మనం అస్పృశ్యతను ఎలా పాటించగలిగాం? ఆదిశంకరుల మీద గౌరవం ఉంటే మనం ఆ పని చేయగలమా ? అంటే మన చాదస్తమే గెలిచిందన్నమాట అవతార మూర్తుల మీద! 'శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శనః' కుక్కలోనూ, కుక్కను చంపి తినేవాడిలోనూ ఒక్కరినే చూడాలని చెప్పిన శ్రీ కృష్ణుని వాక్యమూ అక్కడే ఉన్నది. చాదస్తులపైన ఇవన్నీ పనిచేయని కారణం చేత సమాజంలో ఒక అలజడి వచ్చింది. దానిని రాజకీయ వాదులు పెద్ద ఎత్తున వాడుకున్నారు.

ఈ మధ్య జరిగిన దారుణ సంఘటనలు మనం ఏమి పోగొట్టు కున్నామో తెలియజెప్పాయి. "శార్వరి నుండి శార్వరి"కి అని విశ్వనాథ వారు ఒక నవల వ్రాశారు. కులాల మధ్య సామరస్యం ఎలా ఉండేదో, క్రమంగా ఎలాంటి పరిణామం వచ్చిందో అందులో చూపించారు. కనుక కులాలు ఉండవచ్చు. కులతత్త్వాలు ఉండకూడదు. కులాల ముసుగులో రాజకీయాలు, చాదస్తాలు ప్రవేశించకూడదు. అలాంటి స్థితికి సమాజాన్ని మళ్ళీ ఒకసారి నడిపించడానికేనేమో ఇంత పెద్ద 'షాక్' మనకు తగిలింది.

మరో సత్యాన్ని గమనించాలి. లోకంలో ఈ కులం చెడ్డదని, ఈ కులస్థులు చెడ్డవారని అనుకోవడానికి వీలులేదు. అలా అనుకోవడం అవివేకం, అన్ని కులాలలోనూ మంచివాళ్ళు, చెడ్డవాళ్ళూ ఉంటారు. ఈ సత్యాన్ని గుర్తు చేస్తూ గురజాడవారు ఒక మాట చెప్పారు. "మంచి చెడుగులు మనుజులందున ఎంచి చూడగ రెండే కులములు, మంచి అన్నది మాల అయితే మాల నేనగుదున్."

కాగా మహనీయులు తాము పొందిన సత్య దర్శనాన్ని సమాజ శ్రేయస్సుకు వినియోగించుకోవడానికై సదాచారాన్ని రూపొందిస్తారు. అది క్రమంగా ఒక సంప్రదాయం అవుతుంది. అది తరాల తరబడి నడిచి వచ్చే టప్పటికి, మానవుల రాగద్వేషాల మకిలి దానికి అంటుకుంటుంది. ఈ మకిలితో సహా అది సంప్రదాయంగా చెలామణి అవుతూ ఉంటుంది. ఎప్పుడో విషమ పరిస్థితులు వస్తే తప్ప, ఆ మకిలి యొక్క బెడద ఎంత టిదో మనకు తెలియదు. అప్పుడు ఒకసారి వెనుదిరిగి చూస్తే, రాగ ద్వేషాల అయోమయంలోపడి కొట్టుకుంటున్న నిజమైన సదాచారం వరకు, ఆ సదాచారం వెనుక ఉన్న సత్యదర్శనం వరకు వెళ్ళి, ఆ సత్య దర్శనా నికి అనుగుణంగా ఆ సదాచారాన్ని మరోమారు రూపొందించుకోవలసి ఉంటుంది. సంప్రదాయం మనదే అయినా, దానిని ఎప్పటికప్పుడు సంస్క రించుకోవలసి ఉంటుంది. కసవు రోజూ చిమ్ముకోవలసిందే. ఇప్పుడు వస్తున్న విషమ ఫలితాల దృష్ట్యా మన దృష్టిని తొలి వరకు సారించి, ఈ మధ్యలో పేరుకొన్న కసవును చిమ్మవలసి ఉన్నది. ఆ విధంగా, కులం ఎందుకు పుట్టిందో, దానిని ఎలా సద్వినియోగ పరచుకోవాలో తెలుసు కోవాలి. మన రాగద్వేషాలతో దానిని వినియోగించుకొని సమాజాన్ని ఇబ్బంది పెట్టకూడదు.

విభాగాలు లేకపోతే సృష్టి నడవదు. విభాగాల మధ్య విభేదాలు పుడితే సృష్టి నిలవదు. విభేదాలు పుట్టకుండా విభాగాలు పనిచేయాలంటే వివేకం కలగాలి. మనమంతా ఒకటే అన్న దర్శనాన్ని కలిగించే వివేకం కలగాలి. అందుకై రాగద్వేషాలను వెలిగ్రక్కే మనస్సు హృదయంలో కరిగి, హృదయ స్థానంనుండి విశ్వప్రేమ ఉద్భవించాలి. అప్పుడే విభాగాల సార్థకత తెలుస్తుంది. మన శరీరంలోని భాగాలు ఎలాంటివో సమాజ శరీరంలో ఈ విభాగాలు అలాంటివి. కథ నడవడం కోసం విభాగాలు గాని

అసలు మూలం ఒక్కటే. అందరిలోనూ, అందరిగానూ వ్యక్తమవుతున్నది ఒకే వెలుగు. దైవ సాక్షాత్కారం అంటే అదే. ఆత్మదర్శనం అంటే అదే. ఆత్మ అంటే 'నేను' లేక 'తాను'. లోకమంతా 'తన' మయంగా భాసించి, ఆ తన్మయత్వం విధి నిర్వహణలో అనుభవంలోనికి రావడమే ఆధ్యాత్మిక సాధనకు పరమావధి. ఆధ్యాత్మిక సాధన అదేదో లోకంలో ఏదేదో అనుభవించడానికి కాదు. ఇక్కడ, ఈ లోకంలో మనం కొట్టుకోకుండా బ్రతకడానికి, కష్టలకు, కార్పణ్యాలకు గురికాకుండా జీవించడానికి, నిజమైన సోదరత్వం మన మధ్య వెల్లి విరియడానికి ! మహాత్ముల బోధ అదే. మహనీయుల జీవిత సారం అదే. ఇప్పుడు మనం ఆశ్రయించవలసింది ఆ సాధననే. స్మరించవలసినవి ఆ బోధనలనే, ఆ సన్నివేశాలనే! పాలకులు, పాలితులు చిత్త శుద్ధితో ఈ విధమైన ఆధ్యాత్మిక సాధనలోనికి ప్రవేశించినప్పుడు ఈ విభేదాలకు, ఈ వినాశాలకు ఇక తెర పడుతుంది. ప్రేమ సామ్రాజ్యపు సింహద్వారం మరల ఆవిష్కృతం అవుతుంది.



# సర్పయాగం నుంచి ఆకాశగంగకు

నిన్నా మొన్నా జరిగిన విధ్వంసం, బాధ చూస్తే మహాభారతంలోని సర్పయాగమే మనకు దర్శనమిస్తుంది. రాగద్వేషాలు పెరిగి నలుమూలల నాశనానికి తలపెట్టిన ఒక వ్యూహం అది. ఈ సర్పయాగం ఆగాలి అన్న కోరికతో ఆ కథ గుర్తుచేస్తున్నాను.

ఉదంకుడు అనే శిష్యుడు తన గురువుకు గురుదక్షిణ ఇస్తానంటాడు. మీ అమ్మగారిని అడుగు- అంటాడు గురువు. ఈ దేశపు రాణిగారి కుండలాలను నాకు తెచ్చిపెట్టు నా వ్రతంనాటికి - అన్నది ఆమె. ఉదంకుడు ఆ కుండలాలను తెస్తూ ఉండగా, సంధ్యావందన సమయం అయింది. అవి అక్కడ పెట్టి అతను సంధ్యా వందనానికి వెళతాడు. అతడు వచ్చేలోగా తక్షకుడు వాటిని తస్కరిస్తాడు. ఉదంకుడు అతనివెంట నాగలోకానికి వెళ్ళి ఆ కుండలాలను సాధిస్తాడు.

అయినా కొంత కుర్రతనం, రాగద్వేషాలు ఉన్నాయి కనుక, అతడికి తక్షకుడిని ఎలాగైనా వాయించాలనే బుద్ధి పుట్టింది. ఉగ్ర తపస్సు చేశాడు. తక్షకుడిచేత తనలాగా పీడితులైనవారు ఎవరున్నారా అని ఆలోచించాడు. మన రాజుగారే ఉన్నారని తోచింది.

ఉదంకుడు జనమేజయుని వద్దకు వెళ్ళాడు. 'ఆ తక్షకుడు మీ నాన్నగారిని కాటు వేశాడు. ఆ సర్పకులమే అంత. ఆ కులం మొత్తం నాశనమై

పోవాలి' అన్నాడు. దుర్మార్గం చేసింది ఒక్క తక్షకుడే. మిగతా పాములన్నీ ఏం చేశాయి? కాని, అతడికి ఆ కోపంలో ఆ కులమే నాశనమైపోవాలని అనిపించింది. తన తండ్రి అలా అకాలమరణం పొందినందుకు బాధ జనమేజయునిలోనూ కలిగింది.

బ్రాహ్మణులను పిలిపించి, సర్పకులం నశించడానికి ఏదైన యాగం ఉన్నదా అని అడిగాడు. అలా ఏర్పాటు చేద్దాం - అన్నారు వారు. ఒక యాగం రూపొందించారు. ఆ సదస్యులలో వ్యాసుడూ, ఇతర పెద్దలూ ఉన్నారు. వారంతా ఈ రాగద్వేషాలపైపు చూస్తున్నారు. అదను రావాలి కదా ఏదైనా చేయడానికి.

'స్వాహా, స్వాహా' అంటూ ఉంటే ఎక్కడెక్కడి పాములూవచ్చి హోమగుండంలో పడుతున్నాయి. బుసలు కొడుతూ, విషాలు క్రక్కుతూ ఎన్నో తలల పాములు, ఎన్నో రంగుల పాములు, అవి కాలి దగ్ధమవుతున్నాయి. ఆకాశమంతా ఆ పొగతో నిండిపోయింది.

తక్షకుడికి భయం వేసింది, అతడు సామాన్యుడుకాడు. ఇంద్రుడి వద్దకు వెళ్ళాడు, ఇంద్రుని సింహాసనాన్ని చుట్టుకొని కూర్చున్నాడు. కేంద్రాన్ని పట్టుకున్నాడు. కేంద్రం ఇన్‌ఫ్లూయెన్స్ సంపాదించాడు.

కానీ, మంత్రాలకున్న శక్తి సామాన్యమైనది కాదుకదా. 'సహేంద్ర తక్షకాయ స్వాహా' అన్నారు. ఇంద్రుడితో సహా హోమగుండం లోనికి రావలసిందే అన్నారు. ఇంద్ర సింహాసనంతో సహా కదలి వస్తున్నాడు తక్షకుడు.

ఇంతలో మరోటి జరిగింది. వాసుకి అనే సర్పం ఉన్నది. అతని చెల్లెలు జరత్కారువు. జరత్కారువు మహర్షికి ఇచ్చి ఆ నాగకన్యను పెళ్ళి చేశారు. ఆస్తీకుడు పుట్టాడు. వాసుకి ఆస్తీకుడిని పిలిచి చెప్పాడు. అతడుకూడా కొన్ని వేల పాములను పంపించి కరిపించవచ్చు కదా. అతడు అలా చేయలేదు. రాగ ద్వేషాల మధ్య మన కులం నాశనమైపోతున్నది,

నీవు చాలా వెలుగైనవాడివి. తేజస్వివి. నీ అవసరం ఇప్పుడు వచ్చింది. నీవు వెళ్ళి మహారాజు చేత యాగం ఆపించాలి.

వెంటనే ఆస్తీకుడు యాగస్థలానికి వెళ్ళాడు. యాగ మండపానికి ఒక సూర్యుడు దిగివచ్చినంత వెలుగు వచ్చింది. అంతా ఆ వెలుగుకు పారవశ్యం చెందారు. 'మీ అంతటి వారు వచ్చారు. ఏమి కావాలో కోరు కోండి చెల్లిస్తాను. ఆజ్ఞాపించండి'. అన్నాడు జనమేజయుడు. 'ఈ యాగం ఆపించండి' అన్నాడు ఆస్తీకుడు. మాట తప్పని ఆ రాజు సరే అన్నాడు. యాగం ఆగిపోయింది. పడబోతున్న తక్షకుడు ఆగిపోయాడు. అసలు వ్యక్తి ఆ గుండంలో పడనేలేదు. పడబోతున్న పాములన్నీ ఆస్తీకునికి నమస్కారంచేసి తిరిగి వెళ్ళిపోయాయి.

యాగం ముగిసింది. ఆస్తీకునికి సన్మానం జరిగింది.

యాగం సమాప్తం అయినప్పుడు ఒక ఇతిహాస గాథను వినిపించే సంప్రదాయం ఉంది. వ్యాసమహర్షి దానిని నిర్దేశించాలి అన్నారు. వైశం పాయనా! వారి తాతముత్తాతల కథే వారికి వినిపించు అన్నాడు వ్యాసుడు.

అక్కడ నుండి భారత కథ ప్రారంభమైంది.

ఈ లోకంలో ఏ జాతికాని, ఏ బృందంకాని, ఏ అంశంకాని నిర్మూలమైపోవటం జరగకూడదు, జరుగదు. అన్నీ ఉండాలి. వాటి హద్దులలో అవి ఉండాలి. వాటివల్ల సమాజ ధర్మానికి భంగం కలుగకూడదు.

ఈ భావనతో ప్రారంభమైంది భారతం. ఈ భారత కథను ఎక్కడి దాక తీసుకువెళ్ళారు? రాగద్వేషాలకు అతీతమైన స్థితికి మానవులను తీసుకువెళ్ళటానికే, రాగద్వేషాల సమగ్ర స్వరూపం భారతంలో చూపిం చారు. అన్నదమ్ముల కొట్లాట ఎక్కడలేదు. ఇది ఇతిహాసం ఏమిటి? అని మామూలు దృష్టికి అనిపిస్తుంది. కాని మానవ మనస్తత్వాల మధ్య వైవిధ్యం, సంఘర్షణలు ఎలా ఉంటాయి? ఆ రాగద్వేషాల విజృంభణ ఎలా ఉంటుంది? ఇవన్నీ సమగ్రంగా వారు చూశారు. రాగద్వేషాలు లేకుండా ఉండమని

బోధించారు. మంచిచెడుల ఘర్షణ, మంచికి దైవసహాయం, చెడుకి శిక్షణ ఇవన్నీ పెద్ద యెత్తున చూపారు.

చిట్టచివరికి ఇలా అంటారు. 'ఇదంతా ఈ భూమికి మాత్రమే పరిమితం. ఈ సృష్టి ఒక క్రీడ. ఆట అయిపోయిన మరుక్షణంలో మనం ఒక్కటే. ఓటమి లేదు'. ఈ భావన మనకు చాలా అవసరం.

సృష్టిలోనికి దిగివచ్చేటప్పటికి ధర్మం, అధర్మం, రాగం, ద్వేషం, వర్గాలు, విభిన్న మనస్తత్వాలు, ఘర్షణ ఉంటాయి. ఈ సృష్టి రాకముందు ఉన్నది ఆకాశమే. సృష్టి అయిపోయిన తర్వాత ఉన్నదీ ఆకాశమే. ఆకాశానికి కులంలేదు. మతంలేదు. వర్గంలేదు. ఘర్షణలేదు. మంచిలేదు. చెడు లేదు. అవన్నీ ఈ సృష్టి అనే క్రీడలో అవసరం కాబట్టి ఉన్నాయి.

మానవ జీవితం వర్తిస్తున్న వేళ రాగద్వేషాలు మనలో పనిచేస్తుంటాయి వాటికి అతీతంగా ఉండాలంటే మనం నిరంతరం ఆకాశగంగలో స్నానం చేయాలి. అప్పుడు యాక్షన్ ఉంటుంది. రియాక్షన్ ఉండదు. అధర్మాన్ని ద్వేషించము. కాని హద్దులలో పెడతాము. ద్వేషించినవాడు హద్దుల్లో పెట్టలేడు. కనుక ఆకాశగంగలో స్నానం చేస్తూ ఉండాలి. ఆ ఏకత్వస్థితిని అనుభవిస్తూ ఉండాలి. అక్కడిదాకా నడచి వెళ్ళాలి. అదే స్వర్గారోహణ.

అనగా మానవుడు జీవప్రజ్ఞనుంచి ప్రయాణంచేసి మూలమైన ఆకాశ స్వరూపంలో, అంతర్యామి స్వరూపంలో మేలుకొని, అక్కడ స్నానం చేస్తూ ఉండాలి. లేకపోతే జీవితంలో విధి నిర్వాహణకు బదులు రాగ ద్వేషాలు వస్తాయి. రియాక్షన్ వస్తుంది. రియాక్షన్ వచ్చినప్పుడు నీవు కూడ అధర్మంగా ప్రవర్తిస్తావు.

ఆవేశంలో ఒకడు చంపుతున్నాడు. ఆ తప్పు చేసినవాడిని కోర్టుకు తీసుకువెళ్ళారు. జడ్జి అంతా విని ఉరిశిక్ష వేశాడు. మొదటివాడిని హంతకు డన్నాం. రెండవ వాడిని జడ్జి అన్నాం. మొదటివాడు తప్పు చేసినవాడిని

రాగద్వేషాలతో చంపాడు. కనుక వాడు ముద్దాయి. జడ్జి విధి నిర్వహణ చేశాడు. ఈ సన్నివేశాన్ని గమనించి రాగద్వేషాలకు అతీతంగా ఉండి, ఆకాశగంగలో స్నానంచేస్తూ తీర్పు చెప్పాడు కనుక అతడు న్యాయ మూర్తి.

కనుక ఈ భూమిమీద నీవు ముద్దాయిగా బ్రతకకూడదు. న్యాయ మూర్తిగా బ్రతకాలి.

భగవద్గీతలో కృష్ణుడు అంటాడు. 'ఈ స్థితిలో ఉండి ఎన్ని తలలు తరిగినప్పటికీ నీవు హంతకుడవు కావు. ఈ స్థితిలో ఉన్నప్పుడు నీకు ఏ దోషమూ అంటదు.' అవతలివాళ్ళు రాగ ద్వేషాలతో కత్తులు నూరు తున్నారు. నీవూ, కత్తితో యుద్ధం చేయాలి. కాని నీవు పైకి ఎదగాలి. ఆకాశగంగలో స్నానం చేసేవరకు ఎదగాలి.

కాగా సమాజంలో ఈ కొట్టుకునే లక్షణం మితిమీరకుండా ఏమి చేయగలం? అందుకు రెండే మార్గాలు.

కొద్దీ గొప్ప సంస్కారం ఉండి మంచిగా ఉండాలని కోరుకొనే వాళ్ళే సమాజంలో ఎక్కువమంది ఉంటారు. వారు ఉండలేకపోతున్నారు. కాని, ఉండాలని కోరుకుంటారు. వారందరినీ ఆధ్యాత్మికవేత్తలు ఆకాశ గంగ పైపుకు నడిపించాలి. ఒకప్పుడు సమాజంలో అందరి పనులూ జర గడం కోసం, అందరినీ కలపడంకోసం కులం పుట్టింది. విడదీయడం కోసం కాదు. మనందరం కలసి జీవించాలంటే తలొక పని చేయాలి. సమాజ సహజీవనం సౌకర్యంగా సాగడంకోసం కులమనే ప్రిన్సిపల్ పుట్టింది. ఇవాళ ఆ పనులు వదలివేశాం కనుక ఆ ప్లేర్లతో కొట్టుకుం టున్నాం. ఇలా బోధించడం ఒక మార్గం. అది బ్రాహ్మణ ధర్మం.

సమాజంలోని మరికొందరు ఇలాంటి బోధలకు లొంగరు. అక్కడ క్షాత్రధర్మమే పనిచేయాలి. విననివాడిని క్షాత్ర ధర్మంతో హద్దుల్లో వుంచాలి.

ధర్మమూ, దండమూ రెండూ ఉండాలి. పాలకులు క్షాత్రధర్మం కలిగి, దండంతో దుష్టులను అదుపులో పెట్టగలగాలి.

కానీ-ఇవాళ ఈ రెండూ దెబ్బతిన్నాయి. కనుక సామాజిక శ్రేయస్సు కోసమే ఆధ్యాత్మిక దర్శనం ఉన్నదని, ఆధ్యాత్మిక దర్శనంతో సామాజిక శ్రేయస్సును సాధించినప్పుడే దైవం సంతోషిస్తాడని తెలిసి పనిచేసే ఆధ్యాత్మికవేత్తల సంఖ్య పెరగాలి. ఇదంతా నశించిపోతుంది అని చెప్పి ఏమి ప్రయోజనం? ఈ జీవితం సార్థకం కావడంకోసమే మనం దైవానికి నమస్కరిద్దాం. ఈ జీవితానికి పరిపూర్ణత రావడంకోసమే ఆయ నకు ప్రణమిల్లుదాం' అని చెప్పి నడిపించే ఆధ్యాత్మికవేత్తలు కావాలి. నిరాశా వాదాన్ని ఆధ్యాత్మికత అని చెప్పి నిర్వీర్యం చేశారు కదా జాతిని. దాని ఫలితం ఇవాళ అనుభవిస్తున్నాం.

పూర్వం మన ఆధ్యాత్మిక వేత్తలు జాతిని నిర్మాణం చేశారు. గురు కులాలు అంటే ఏమిటి? నవతరాన్ని వారి దివ్యస్పర్శతో రాగద్వేషాలకు అతీతంగా సమాజానికి వినియోగపడే విధంగా రూపుదిద్దడానికి తమ జీవి తాన్ని ధారపోశారు మహర్షులు. ఇవాళ ఆధ్యాత్మిక సంస్థల పేరిట ఎక్కు వగా జరుగుతున్నది సేవా కార్యక్రమాలే కాని నిర్మాణ కార్యక్రమాలు కాదు. సేవ మంచిదే. కాని అది సెకండరీ.

మొన్నటి విధ్వంసంలో ఎక్కువగా పాల్గొన్నది 15-25 ఏళ్ళ కుర్రవాళ్ళు. ఆ దోషం వాళ్ళదికాదు. వాళ్ళను తీర్చిదిద్దలేకపోయిన మనది.

మీరు వాళ్లకు దైవతత్త్వం చెప్పలేదు. కనుక కులతత్త్వమో, మతతత్త్వమో వాళ్లలో ప్రవేశిస్తుంది. ఇప్పటికైనా క్రొత్తతరాన్ని దివ్య స్పర్శలో, ధర్మస్పర్శలో పెంచాలి. శాశ్వత పరిష్కారం ఇదే!

★

# హిందూ సోదరులారా!

శ్రీ గిరిధరరావు : నమస్కారం కృష్ణస్వామిగారూ ! నేడు హిందూ ధర్మం ఎదుర్కొంటున్న పరిస్థితుల గురించి మీ అభిప్రాయాలు తెలుసుకోవాలని వచ్చాను.

శ్రీ కృష్ణస్వామి : నమస్కారం రండి దయచేయండి. "భారతీయ మార్గం" ప్రతినెల చదువుతున్నాను. ఉత్తమ రీతిలో నడుపుతున్నారు. సంతోషం. మీరేమి అడగదలిచారు ?

గిరి : క్రైస్తవులలోగాని, ముస్లింలలోగాని కూలిపని చేసేవాని మొదలు జిల్లా కలెక్టరు వరకు తాను క్రైస్తవుడననో, ముస్లిననో భావిస్తాడు. తన మత సిద్ధాంతాలలో ఏవో కొన్ని అతని మనస్సులో మెదలుతాయి. వాటిని అమలు పరచడానికి గూడ ప్రయత్నిస్తాడు. కాని హిందువులలో అట్లాకాదు. రిక్షాలాగే వాడినుండి ప్రధానమంత్రి వరకు తాము హిందూ ధర్మానికి చెందిన వారమనే గమనిక లేదు. హిందూధర్మంయొక్క మౌలిక సూత్రాలు అంతగా వారి మనస్సులో ఉండవు. ఏవో కొన్ని కులాలవారు తప్ప మిగతావారు తాము హిందువులమని భావించరు. తమ ధర్మం గురించిన అవగాహన అంతగా లేదు.

కృష్ణ : దీనికి కారణ మేమిటంటారు ?

గిరి : నేను అనుకోవడమేమిటంటే, హిందూధర్మం పండితులకూ, వేదాధ్యయన పరులకూ పరిమితమై పోయింది. చదవడం వ్రాయడం తెలిసిన సామాన్య ప్రజలు చదివి గ్రహించడానికి వీలుగా మన ధర్మశాస్త్రాలు లేవు. నేను ఢిల్లీలో ఒక సిక్కు కారు డ్రైవరును కలుసుకున్నాను. అతడు రాత్రి నిద్రపోబోయే ముందు "గురు గ్రంథసాహెబ్"లో కొన్ని పేజీలు చదివి పడుకుంటాడు. అది తనకు ఉత్సాహాన్నీ మనశ్శాంతినీ ఇస్తుందని చెప్పాడు. ఆ విధంగా హిందువులలో ఒక చేనేత కార్మికుడు, ఒక కూరగాయల వర్తకుడు, ఒక మధ్యతరగతి గృహిణి ప్రతిదినం చదివి తన జీవితాన్ని ప్రకాశవంతం చేసుకునే రీతిలో వచనంలో ఒక పారాయణగ్రంథం అవసరమనిపిస్తున్నది. ఉన్న పుస్తకాలు శ్లోకాలలోను, పద్యాలలోను ఉన్నాయి. అవి సామాన్యుడికి అర్థంకావు. అందుచేత హిందూధర్మం హిందువుల జీవితాలను ప్రభావితం చేయకుండా పోతున్నదని నా సందేహం.

కృష్ణ : వాల్మీకి రామాయణాన్ని, వ్యాసుడు భారత, భాగవతాదులను రచించడంలో వారి ఉద్దేశ్యం మీరడిగినదే! వేదాలు, ఉపనిషత్తులు అందరూ అర్థంచేసుకోగలిగినవికావు.గనకనేవీటిని ప్రత్యేకంగారచించారు. దూరదర్శన్‌లో రామాయణమూ, భారతమూ ప్రసారమవుతుంటే ఆసేతు హిమాచల పర్యంతం ప్రజలు ఎంతగా ఆకర్షితులవుతున్నారో మీరు గమనించే ఉంటారు. అందుచేత జనబాహుళ్యం కొరకే ఈ గ్రంథాలను మహర్షులు రచించారని మనం గమనించవలసివున్నది.

గిరి : మీరు చెప్పింది కాదనను, కాని క్రైస్తవ మతస్థులు బైబిలు నుండి స్ఫూర్తి పొందగలుగుచున్నారు. అది వారి జీవితాలకు సన్నిహితంగా ఉన్నది. ఒక క్రైస్తవ మహిళ తన కుమారుడు పరీక్ష వ్రాయడానికిపోతే, తన కుమారుడు బాగా వ్రాయాలని కోరుకుంటూ ప్రార్థనలు చదువు

తుంది. ఆ విధంగా ఏ గ్రంథమూ సాధారణ హిందువు నిత్యజీవితానికి వెలుగు బాటగా ఉపకరించడంలేదు.

కృష్ణ : లోపం మన గ్రంథాలలో లేదు. వాటిని బోధించే వారిలో ఉన్నది. మానవులను ధర్మార్థకామ మోక్షాలనే నాలుగు పురుషార్థములను నిర్వహించడంలో నిపుణులుగా తయారుచేయడానికే రామాయణ, భారత, భాగవతాలు రూపుకట్టుకున్నాయి. ఐతే వాటిని బోధించేవారు మోక్షమునకు అత్యధిక ప్రాధాన్యమిచ్చి మిగతా ధర్మ, అర్థ, కామములను సాధించడం గురించి అంతగా వివరించకుండా దాటవేస్తున్నారు. ఐహిక జీవితంలో ఎలా నడుచుకోవాలి, ఎలా విజయం సాధించాలి- అనే దానికి తగిన ప్రాధాన్యమివ్వడంలేదు. అంతేగాదు. ధర్మ, అర్థ, కామములను సక్రమంగా సాధించడం వల్లనే మోక్షానికి కావలసిన అర్హత, మోక్షమనే దివ్య స్థితి గూడ లభిస్తుందనే సత్యాన్ని వారువిస్మరిస్తున్నారు. పెద్దలలో ఎక్కువ మంది వారికి తెలిసింది చెపుతున్నారేగాని సామాన్యునికి కావలసింది చెప్పడంలో శ్రద్ధ పెట్టడంలేదు. పురుషార్థాలను ప్రక్కనపెట్టి; వేదాంత బోధలకు అధిక సమయం కేటాయిస్తున్నారు. అట్టి గోష్ఠులు ఆకాశంలో మెరుపులవంటివి. ఆ మెరుపులను చూచి మెచ్చుకోగలం గాని వాటితో ఇంటి దీపాన్ని వెలిగించుకోలేము గదా.

గిరి : హిందూధర్మ ప్రచారకులు గమనించవలసిన ముఖ్య విషయం మీరు చెప్పారు. ఇంకా ఇలాంటి సూచనలు ఏమైనా చేస్తారా?

కృష్ణ : భారతీయులలో ఎక్కువమంది కర్మ సిద్ధాంతాన్ని తప్పుగా అన్వయించుకుంటున్నారు. ఆ సిద్ధాంతాన్ని అర్థంచేసుకోవడంలో పొరబాటు పడుతున్నారు. ప్రపంచంలో జరిగే ప్రతి కార్యానికి ఫలితముండి తీరుతుందని ఆ సిద్ధాంతం చెబుతుంది. ఇది అన్ని కాలాలకు వర్తించే పరమ సత్యం. అందుచేత సత్ఫలితం పొందాలంటే ప్రతివారూ సత్కార్యాలను ఆచరించాలని ఇందలి సందేశం.

మనవాళ్ళు దీనికి పెడర్థాలు కలిగించి, ఎవడికి, ఏ ఆపద వచ్చినా అది వాడి "ఖర్మ" అంటూ, వాడు భరించక తప్పదని వేదవి విరుస్తున్నారు. ఆ కష్టాన్ని ఎదుర్కొనడంలో వాడికి అండగా నిలవడంగాని, వాడి దుఃఖాన్ని పంచుకొనడంగాని చేయడంలేదు. సానుభూతి, కరుణ, జాలి, అనే వాటికి స్థానం లేకుండా వ్యవహరిస్తున్నారు. ఇంట్లో భార్య ఒక బంధం, బిడ్డలు ఒక బంధం, బంధువులొక బంధం, బాధ్యతలొకబంధం— అంటూ ఎక్కడికక్కడ ఆప్యాయత, అనురాగం లేకుండా త్రుంచివేశారు. ఎవడైనా చనిపోతే "ఋణం తీరిపోయింది. - సరిపెట్టుకోండి" అంటున్నారు. ఇక అతన్ని మర్చిపోండి అని నొక్కి చెబుతున్నారు. ఇదంతా ఓదార్పు అనుకోమంటున్నారు. కనీసం వాడి శవాన్ని స్మశానానికి మోయడానికి కూడ ఎవరూ ముందుకు రారు. మనిషికి మరో మనిషి బరువు, బంధము, ఋణము అయినట్లు మాట్లాడుతున్నాం. ఇలా జీవితాన్ని ఎడారిగా తయారు చేశాం. మమత, ఆదరణలు హిందూ సమాజంలో కరువవుతున్నాయి. "నన్ను ఎవడన్నా మనిషిగా చూసి పలకరిస్తే బాగుండు"నని హిందువులలో అనేకులు అనుకునే దుస్థితికి తీసికొనివచ్చాం. అట్టి స్థితిలో క్రైస్తవ మత ప్రచారకులు ఆప్యాయంగా పలకరించడంవలన పలువురు హిందువులు అటు మొగ్గుతున్నారు. అందుచేత ప్రజలకు కావలసింది ఆత్మ పరమాత్మల చర్చకన్నా ఆప్యాయతతో పలకరింపు మొదట కావాలి. ఈ సత్యాన్ని మనవాళ్ళు ఇప్పటికైనా అర్థంచేసుకోవాలి.

గిరి : మీరు చేయదలచిన రెండవ సూచన ఏమిటి?

కృష్ణ: రెండవ సంగతి ఏమిటంటే మాయా సిద్ధాంతం. మనవాళ్ళు దీనికికూడా తప్పుడు భాష్యం చెప్పుకుంటున్నారు. అసలు దీని సరియైన అర్థమేమిటంటే, పైకి కనిపించేది తాత్కాలిక సత్యం, లోపల ఉంది శాశ్వతసత్యం అని. చంద్రహారం అనేది బయటకు కనిపించేది: బంగారం

లోపల వున్నది. చంద్రహారాన్ని చెడగొట్టి గాజులు చేయిస్తాం; గాజులు చెడగొట్టి దిద్దులు చేయిస్తాం. బయటి రూపాలు నిరంతరం మారుతూ ఉంటాయి; లోపలవున్న బంగారం మారనిది. ఆ లోపలి దాన్ని గుర్తి స్తూనే బయట కనిపించేదాన్ని సద్వినియోగం చేయమంటారు ఆదిశంక రులు. అంతేగాని బయటకు కనిపించే చంద్రహారం, గాజులు మొదలైనవి పనికిరావని అర్థంకాదు. బంగారం ఆయారూపాలు తీసుకోవడం వల్లనే అవి వినియోగమవుతున్నాయి.

ఇంకా చెప్పాలంటే లోపలి స్వరూపాన్ని గుర్తించినపుడు మాత్రమే 'బయటకు కనబడేదాన్ని నీవు సద్వినియోగము జేయగలవు' అన్నది ఆదిశంకరుల హెచ్చరికగా మనం గ్రహించగలగాలి. తాను అద్వైత స్థితిని అనుభవిస్తూనే ఈ భూమిమీద శంకరులు చేసిన మహో న్నతమైన, అనితర సాధ్యమైన కృషియే ఇందుకు ఒక ఉదాహరణ.

గిరి : మనవాళ్ళు దీనికి ఏ విధంగా పెడర్థం చెప్పారు ?

కృష్ణ : కనిపించే ప్రపంచం యావత్తూ మాయ, అసత్యం అని అర్థంచెప్పి దాన్ని పట్టించుకోనవసరం లేదంటున్నారు. అందుచేత హిందువుడు జీవితంలో విఫలమవుతున్నాడు. ఈ దేశంమాయ, ఈ ప్రజలు మాయ, ఈ ఇళ్ళూ వాకిళ్ళూ మాయ అంటూ దేనిమెడలా శ్రద్ధ చూపడం లేదు. పనిలో పట్టుదల చూపడంలేదు. గాలిలో మాట్లాడుతాడు గాని వాస్తవ దృష్టితో ఆలోచించడు. అన్నీమాయ అయితే తన శరీర అవస రాలు అక్కర్లేదా? అతనికి ఆకలి కలగడంలేదా! అన్నం నీళ్ళూ మాని వేశాడా? మాయలో కొట్టుకుపోయి తనచుట్టూ వున్న దేశాన్ని, సమాజాన్ని, వాటిమెడల తన బాధ్యతలను విస్మరించాడు. దీని ఫలితంగా వెయ్యేండ్ల బానిసత్వం అనుభవించాం. ఇంతకంటే జాతిద్రోహం మరొకటి లేదు.

గిరి: మరి విదేశీ మతాలకు ఇచట స్థానం ఎలా లభించింది?

కృష్ణ : నేను ఇపుడు చెప్పిన రెండులోపాలే క్రైస్తవ మత ప్రచారకులకు అవకాశాలు అయినాయి. ప్రజలకు కలిగే కష్టాలకు క్రైస్తవ ఫాదరీ సానుభూతి చూపుతాడు. తద్వారా మనుషులకు దగ్గరైనాడు. సామాజికంగా మనం నిర్లక్ష్యం చేసిన విద్యాబోధను, వైద్య సేవను రెండు ఉపకరణములుగా గ్రహించి అతడు పేదసాదలకు చేరువైనాడు.

గిరి : భారతదేశంలోకి క్రైస్తవం ఉదాత్త లక్ష్యంతోనే ప్రవేశించిందా ?

కృష్ణ : ఇచట ప్రవేశించిన వారిలో రెండురకాల మిషనరీలున్నారు. మానవ జాతికి సేవచేయాలనే తపనతో వచ్చినవారు ఒక రకం. బ్రిటన్, ఫ్రాన్సు, పోర్చుగల్ వారు స్థాపించిన సామ్రాజ్యాలకు రక్షణ చేకూర్చడానికై ఇచటి ప్రజలను భయపెట్టి, ప్రలోభపెట్టి క్రైస్తవులుగా మార్చిన వారు రెండవరకం. ఈ రెండవరకం వారు చేసిన మతాంతరీకరణలు ప్రమాదకరమైనవి. వాటి మూలాన దేశంలో వేర్పాటు ధోరణులకు అవకాశం కలిగింది.

గిరి : ఇపుడు హిందూధర్మ ప్రచారకులు ఏమి చేయాలి?

కృష్ణ : ఇందాక మనం చెప్పుకున్నట్లు ముందు మనం ఆత్మవిమర్శ చేసుకోవాలి. ప్రజలకు కావలసింది సిద్ధాంత చర్చలు కాదు. ఆదరణ, ఆప్యాయత, అండదండలు వారికి ముందు కావాలి. వాటిని సమకూర్చడంతో బోధను ప్రారంభించడమే సిసలైన ధర్మప్రచారం.

గిరి : క్రైస్తవం గురించి మీ అభిప్రాయ మేమిటి?

కృష్ణ : ఏసుక్రీస్తు ప్రేమను కురిపించాడు. కరుణతో మానవజాతిని కౌగలించుకున్నాడు. తన పేరిట మతం పెట్టమని అతడు చెప్పలేదు. క్రీస్తును స్వీకరిద్దాం. క్రీస్తుమతం అక్కరలేదు. నీవు భారతీయుడుగా ఉంటూనే క్రీస్తు బోధనలను స్వీకరించవచ్చు. అసలు భగవద్గీతలోని కొన్ని మూలసూత్రాలకు అందమైన భాష్యమే బైబిలు. భారతీయుడు బైబిలుకు భాష్యం చెప్పవలసిన ఆవశ్యకత నేడు ఉన్నది

గిరి : చాలా మంచి విషయాలు, ఆలోచనలను రేకెత్తించే విషయాలు చెప్పారు. ధన్యవాదాలు, భగవద్గీతకూ బైబిలుకూ గల సారూప్యత గురించి మీతో మరొకసారి ఇష్టాగోష్ఠి జరుపుతాను.



# పల్లెలను కల్పవృక్షాలుగా...

విద్య, వైద్యం వ్యాపారాలుగా మారడం దారుణం. తల్లి తన చనుబాలను బిడ్డలకు అమ్ముకోవడమే అది. వ్యక్తి వికసించడం కోసం వచ్చినా, ప్రాణభీతితో వచ్చినా-వర్షించవలసింది ప్రేమ.

కానీ, నేడు పిల్లవాడికి జ్వరం వస్తే కుటుంబ బడ్జెట్ తలక్రిందులు అవుతున్నది. అల్లోపతీతో బెస్టు పేరిట రోగులను పీడించడం పెరుగుతున్నది. అయినా ఈ వైద్యం వల్ల ఉపశమనమే కాని నివారణ జరగడం లేదు. హోమియోలో నివారణకు చక్కని అవకాశం ఉన్నది. కాని ఆ వైద్యం చేసే పలువురిలో శ్రద్ధ ఉండడం లేదు. కనుకనే శ్రద్ధ, సేవాభావం కలిగిన హోమియో వైద్యుల సంఖ్యను పెంచే ఉద్యమానికి శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య శ్రీకారం చుట్టారు.

నేడు ఏజెన్సీ ప్రాంతాలలో డాక్టర్లను నియమిస్తే వారు అక్కడ ఉండడం లేదు. అక్కడ ఉండే విద్యావంతులకు, సేవాభావం కలిగిన వారికి ఈ శిక్షణ ఇస్తే, వారే ఈ వైద్యాన్ని అక్కడి ప్రజలకు అందిస్తారు.

ప్రభుత్వం వైద్యంకోసం కోట్లు ఖర్చు పెడుతున్నది! కాని ఆ డబ్బు సద్వినియోగం కావడం లేదు. గ్రామ ప్రాంతాలలో ప్రభుత్వ ఆస్పత్రులు పేరుకే ఉంటున్నాయి. అన్ని మందులూ అక్కడ ఉండవు.

ఉన్నవి సద్వినియోగమయ్యే సందర్భాలు తక్కువ. అక్కడ అభినయం జరుగుతున్నంతగా నయం జరగడం లేదు. సేవాభావం అరుదు. వనరులు తక్కువ.

స్వరాజ్యం రాగానే ప్రభుత్వం ఆయుర్వేదాన్ని పెద్ద యెత్తున ప్రోత్సహించి ఉండవలసింది. అల్లోపతీని తగ్గించి హోమియోను ప్రోత్స హించి ఉండవలసింది. ఎందుకంటే, అల్లోపతీలోని లోపాలను సరిదిద్దడానికే తర్వాత హోమియో వచ్చింది.

కానీ, అల్లోపతీ మీదనే రాజముద్ర ఉంటున్నది ప్రధానంగా. ప్రాథ మిక ఆరోగ్య కేంద్రాలలో నూటికి తొంభై అవే.

నిజానికి, ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో అల్లోపతీ, ఆయుర్వేదం హోమియో విభాగాలు మూడూ ఉండాలి. ఈ మూడూ చదువుకున్న జన రల్ డాక్టర్ పర్యవేక్షణలో అవి పనిచేయాలి. ఈ విభాగాల మధ్య అను సంధానం ఉండాలి. అపుడు రోగికి త్రిప్పట తప్పుతుంది.

మన జాతీయ వైద్యం ఆయుర్వేదం. అది ప్రపంచ ప్రసిద్ధి పొందు తున్నది. దాన్ని పునరుజ్జీవింపజేయాలి.

అంతేకాదు, ప్రతి వైద్యునికీ ఇతర విధానాలలో కొంత ప్రవేశం ఉండాలి. అయిదేళ్ళ కోర్సులో కనీసం చివరి సంవత్సరంలో అయినా మిగతా వైద్య విధానాల అనుపానులు తెలియజేయాలి. ఇప్పుడు ఎమ్. బి. బి. యస్. చదివినవారు స్పెషలైజ్ చేస్తున్నారు. వీరు హోమి యోను, ఆయుర్వేదాన్ని ఎందుకు స్పెషలైజ్ చేయకూడదు. కాని, నేడు ఒక 'పతీ' మరొక 'పతీని' నిందించడం, ఒకరి ఫండమెంటల్స్ మరొకరికి తెలియక 'మెంటల్'గా ప్రవర్తించడం చూస్తున్నాం.

నేడు డెలివరీ కోసం ఆపరేషన్ చేయబడుతున్న కేసులలో, సర్జరీ కేసులలో ఎనభై శాతం హోమియో ద్వారా ఆపరేషన్ లేకుండా నయం

చేయవచ్చు. ఆయుర్వేదం వాడితే ఇన్నిరకాల కెమికల్ టానిక్‌ల అవసరం ఉండదు. శరీరానికి చక్కని పోషణ, వర్చస్సు వస్తాయి.

కనుక వైద్య విధానాలను వైద్యశాస్త్రంలో అధ్యాయాలుగా చదువు కొనే మంచిరోజులు రావాలి. 'న్యూ ఎరా హీలింగ్'కు నాంది పలకాలి. ఇది జరుగనందువల్ల పల్లెలలో పుస్తెలతో సహా అమ్ముకోవలసి వస్తున్నది.

కాగా-నేడు మధ్యతరగతి ప్రజలలో హోమియో గురించి ఉన్న మేలుకొలుపు పై తరగతులలో, క్రింది తరగతులలో తక్కువగా కనిపి స్తున్నది. కారణం స్పష్టమే! మోతుబరుల దృష్టి స్పెషలిస్టుమీదే. వారంతా అయితే తప్ప, హోమియో గురించి ఆలోచించరు. ఇక క్రింది తరగతు లలో ఇంజక్షన్ ఇస్తేనే వైద్యమనే భావం వ్యాపించి ఉన్నది. డబ్బు వదిలితేనే వైద్యం లభించిందనే తృప్తి కలుగుతుంది. పైగా మనం పెద్ద యెత్తున 'షో' కోరుతున్నాం. రెండు మిషన్లు ఉంటే, పెద్ద బిల్డింగ్ ఉంటే పెద్ద వైద్యం అనే భావం, ఆకర్షణకు లొంగే తత్త్వం ఉంటున్నది.

కాగా—కార్మిక నాయకులు కార్మికుల ఆదాయం పెంచడానికి కృషి చేస్తున్నారు. ఆ ఆదాయం సద్వినియోగం అయ్యేటట్లు చూస్తున్నారా? వారిని వ్యసనాలకు దూరం చేయగలుగుతున్నారా? వచ్చే అదనపు ఆదాయం వ్యసనాలకు ఖర్చయితే ప్రయోజనం ఏముంది?

నైతిక విలువల ప్రాధాన్యం గాంధీగారితోనే వెళ్ళిపోయింది. ఆర్థిక విలువలకు అధిక ప్రాధాన్యం ఇస్తున్నారు. నైతిక విలువలు పెరగ నప్పుడు వీటి ఉపయోగం ఎంత?

ప్రజలు బాగుపడకుండా ప్రభుత్వమూ తనవంతు కృషి చేస్తుంది. మద్యపాన నిషేధాన్ని తొలగించడం "మీరు చెడిపోవచ్చు" అని సూటిగా

చెప్పడమే. నేడు రెండు రూపాయలకు కిలో బియ్యం ఇస్తున్నారు. ఆదా అయిన డబ్బు వ్యసనాలకు పోతుంది. ప్రయోజనం ఏముంది ?

ఆదాయం పోతుందికదా అంటుంది ప్రభుత్వం మరి ఆదాయంకోసం ప్రజలు 'చెడిపోయినా ఫరవాలేదా'! ఈ ఆదాయం, పరిపాలన ఎవరికోసం? వాళ్ళు త్రాగి తూలుతూ, స్పృహతప్పి పడిపోతూ ఉంటే- దానిమీద వచ్చిన ఆదాయంతో ప్రభుత్వం నడవాలనుకోవడం ఎంతటి విషమ స్థితి! జాతికి విషం పెట్టి డబ్బు సంపాదించాలా?

బస్సులలో త్రాగి పడిపోతున్నారు. కండక్టరు త్రాగి పడిపోతున్నాడు. కానిస్టేబుల్ త్రాగి పడిపోతున్నాడు. కానిస్టేబులే కాని, స్టేబుల్‌గా ఉండడు.

ప్రభుత్వం నిషేధిస్తే సరేసరి, లేదా పదిహేను సంవత్సరాలలో మా గ్రామంలో "డిపోవద్దు" అనే ఉద్యమం వస్తుంది.

వ్యసనాలు ఎప్పుడూ ఒంటరిగా ఉండవు. మద్యపాన శాల పెట్టాం. ప్రజలు త్రాగి రాత్రికి రాత్రి చంపుకున్నా దిక్కులేదు. దురాచారాలకు ఒడిగట్టినా దిక్కులేదు. త్రాగినవాడు దురాచారాలకు ఒడిగట్ట కుండా తగిన కట్టుదిట్టాలు చేసి పెడుతున్నారా మద్యశాల!

మంచినీళ్ళు అందనిచోట్లు చాలా వున్నాయి. ఈ "మందు" నీళ్ళు అందించడానికి ఇంత ప్రయత్నం ఎందుకు?

క్రమంగా ఈ వ్యసనం స్త్రీలకుకూడా వ్యాపిస్తోంది. ప్యాకెట్లలో ఇస్తూ వుండడంతో—పాలప్యాకెట్లతో వీటినీ పట్టుకు వెళ్తున్నారు. మరి సంక్షేమం సృష్టిస్తున్నామా? సంక్షోభం సృష్టిస్తున్నామా?

మద్యపానాన్ని నిషేధించనంతవరకు జాతిశ్రేయస్సు కుంటుపడ్తూనే ఉంటుంది.

కాగా—రాష్ట్రపతి వి. వి. గిరి హోమియో మందులు వాడేవారు. ఇందిరాగాంధి ఎక్కువగా హోమియో మందులే వాడేవారు. మరి దేశంలో దానిని పెద్ద ఎత్తున ఎందుకు అమలు జరపలేకపోయాం ? అల్లోపతీ మందుల కంపెనీలు రాజకీయపార్టీలకు ఎన్నికల నిధులు ఇవ్వడం ఒక కారణమని కొందరంటారు.

పల్లెలలోని విద్యావంతులైన యువకులు హోమియో శిక్షణ పొంది తమతమ గ్రామాలలో సేవా కేంద్రాలు ప్రారంభించడం ఈ సమస్యకు ఒక పరిష్కారం. నా అనుభవం అదే. నేను మా స్వగ్రామం కోడూరులో సేవాకేంద్రం నిర్వహించాను. ప్రజలనుండి మంచి ఆదరణ లభించింది.

కోడూరు దగ్గర ఒక గ్రామం నుండి పలువురు ఫారిన్ వెళ్ళారు. వారిలో ఒకరిద్దరు తిరిగి వచ్చి ఆ ఊరును తీర్చిదిద్దితే ఎంతో బాగుంటుంది!

కాని పల్లెలు మనుషులనూ, పాలనూ పట్టణాలకు ఇస్తున్నాయి. దారుణ స్థితిలో మిగిలిపోతున్నాయి చెరుకు పిప్పిలా!

గుళ్ళు గోపురాలు కట్టిస్తున్నాం. మంచిదే! సజీవ విగ్రహాలమీద, మనుషులమీద ఖర్చుపెట్టడానికి ముందుకు రావడంలేదు. గుడి నిర్మించి, అర్చకునికి నిజాయితీ లేకపోతే ఏమి ప్రయోజనం? వ్యక్తిత్వ నిర్మాణం జరగకుండా కట్టడాల నిర్మాణం జరిగితే, వాటి సార్థకత యేమిటి?

ఒకసారి ద్రాక్షారామం గుడికి వెళ్ళాం. ఎంత పెద్ద ప్రాంగణం! యెన్ని శిక్షణ శిబిరాలు నిర్వహించవచ్చు— అనిపించింది. హంసలదీవిలో దేవాలయం ఉన్నది. అక్కడ ఒక సేవా కేంద్రంనడపవచ్చు. బాల వికాస కేంద్రం నడపవచ్చు. ఉదయం వేద శిక్షణ ఇవ్వవచ్చు.

ఈ మార్పును మొదట కోరింది వివేకానందుడు. రాబోయే విపత్తులను గ్రహించి, ఆయన వ్యక్తిత్వ నిర్మాణానికి ప్రాధాన్యం ఇచ్చారు. సేవాభావంతో కూడిన ఆధ్యాత్మికత అవసరం అన్నారు. సమాజ సేవకు

లను రూపొందించే పథకాన్ని ప్రారంభించారు. దానిని పెద్ద ఎత్తున కొనసాగించాలి!

కాని, నేడు యువతరం డీజనరేట్ అవుతున్నది. వ్యక్తిత్వ నిర్మాణం విద్యాలయాలలో, బయటా, గృహాలలో - ఎక్కడా జరగడం లేదు. ఏదో విధంగా నాలుగు రాళ్ళు సంపాదించు — అంటున్నారు తల్లి దండ్రులు. శీల నిర్మాణంమీద వారికి దృష్టి ఉండడంలేదు. యువజనులు చెడిపోతున్నారు.

మనం స్వరాజ్యాన్ని శీలంతోనే తెచ్చుకున్నాం. ఆ తర్వాత ఘన కొక "బర్నింగ్ జీల్" లేకపోయింది. ఆర్థికం వైపు దృష్టి మళ్ళింది. సంపాదనకు అడ్డువచ్చే నియమాలను ప్రక్కన నెట్టివేద్దాం అనే ధోరణి ప్రబలింది. ఫలితం అనుభవిస్తున్నాం.

యువతరం బాగుపడకుండా మధ్య వచ్చిన ఒక జనరేషన్ అడ్డు పడింది. పార్టీలు వచ్చిన తర్వాత పరిస్థితి మరీ చెడిపోయింది. ఒకపార్టీ హయాంలో కరెంటు రాకుండా చూస్తుంది మరోపార్టీ, ఆ పార్టీకి పేరు వస్తుందేమోనని.

గ్రామసీమల స్థితి దారుణంగా ఉంది. క్రమంగా అందరూ ఖాళీచేసి వీడు పెట్టే స్థితిని సృష్టిస్తున్నాం.

ఈపరిస్థితి ఎలా మారుతుంది? "యద్య దాచరతి శ్రేష్ఠః" నాయకులలో, ఉన్నత స్థానాలలో ఉన్నవారిలో మార్పువస్తే, కొద్ది సమయంలోనే పరిస్థితి మారుతుంది.

కానీ - పల్లెలలో మంచిపని చేద్దామన్నా ఇబ్బందులు ఎదురవు తున్నాయి. ఒక ఊళ్ళో ఒక విగ్రహం బయటపడింది, ఊరి ప్రజలంతా గుడి కడదామనుకున్నారు. ఒక యువకుడు నాయకత్వం వహించాడు.

ఊరి పెద్దలకు అది గిట్టలేదు. గుడి కట్టడం జరిగితే ప్రజలు ఆ యువ కుడి మాటే వింటారేమో. తమ పెద్దరికం పోతుందేమో! ఊరి పెద్దలు రకరకాల పుకార్లు లేవదీశారు. గుడి నిర్మాణం జరగకుండా చూశారు. అలాంటి ఊళ్ళు, పెద్దల తరం గతించినపుడే బాగుపడతాయి.

విద్య యువతరానికి ప్రేరణ ఇవ్వగలిగితే వివేకానందులు, అరవిందులు తయారవుతారు. అలాంటి ప్రేరణ కలగకుండా మనం వారిని కాపాడుతున్నామా- అని అనుమానం కలుగుతుంది, నేటి విద్యా విధానాన్ని చూస్తే! విద్యలో సమాచారమే కాని ప్రేరణ ఉండడం లేదు. స్వరాజ్య సమరయోధుల జీవిత గాథలు మనం బోధిస్తున్నామా? సమాజంమీద, ప్రభుత్వం మీద డిపెండెంట్లుగా, నిరుద్యోగులుగా యువతరం మిగిలిపోయే విద్య మాత్రమే మనం ఇస్తున్నాం.

నేడు పల్లెసీమలు ఇలా నీరసించి పోవడానికి కారణం వ్యక్తిగత ప్రయోజనాలు ప్రధానం కావడం. పదవులూ, పెద్దరికాలూ ముఖ్యం కావడం..

కోనసీమలోని ఒక పల్లెనుంచి రాత్రికి రాత్రి ఒక వైద్యుడు తరిమి వేయబడ్డాడు. పనికివచ్చే వాళ్ళను పల్లెనుంచి తరిమివేసేవాళ్ళు ఉన్నారు. ఆ వైద్యుడు విశాఖలో నర్సింగ్ హోమ్ పెట్టుకున్నాడు. దేవుడిలాంటి మనిషి ఆయన. "ఆ కక్షలకు, కార్పణ్యాలకు తట్టుకోలేక పోయాను" అన్నాడాయన. కుహనా నాయకులు చేసే కుట్రల ఫలితాలు ఇలా ఉంటాయి కనుక, యువతరం మేలుకొని కొత్త నాయకత్వాన్ని నిర్మించుకోవాలి.

ఒక ఊరిలో ఒక ఆలయం ఉంది. దానికి కొంత పొలం ఉంది. ఆలయ కమిటీ సభ్యులు ఆ ఆదాయం తినివేస్తున్నారు. గుడి పాడుబడింది. దాన్ని పునరుద్ధరించాలని యువతరం ముందుకు వచ్చింది. "దేవుడి సొమ్ము తింటున్నారు. ఆ పొలం వదలండి" అని ఆ సభ్యులను నిల

దీశారు. "మాకు అప్పగించండి సద్వినియోగం చేస్తాం" అన్నారు. అప్ప గించవలసి వచ్చింది. యువకులు మూడు నెలల్లో ఆలయాన్ని రీమోడల్ చేశారు. పెద్దయెత్తున కళ్యాణం జరిపించారు. దేవుడి ఆస్తి గింజ కూడా దుర్వినియోగం కాకుండా చూచారు.

ఇలా చదువుకున్నవారిలో, యువతలో ఆత్మవిశ్వాసం పెరగాలి. పెద్దలలోని ఆర్థికమైన తృష్ణను, పదవీకాంక్షను హద్దుల్లో పెట్టి, వారు గ్రామాలను పునర్నిర్మాణం చేసుకోవాలి.

ఆర్థిక ప్రయోజనాలకోసం యువకులు గ్రామాలు వదలి బస్తీలకు తరలి వస్తున్నారు. పల్లెలలోని ప్రకృతి వనరులను సమీకరించుకొని చిన్న చిన్న పరిశ్రమలు నెలకొల్పితే, అక్కడ పని దొరుకుతుంది. అక్కడే ఆదాయం లభ్యమవుతుంది. తరలి రావలసిన అవసరం ఉండదు.

అలా గ్రామాలను ఉత్పత్తి కేంద్రాలుగా మార్చి, బస్తీలను విని మయ కేంద్రాలుగా చేయాలి. అప్పుడు కర్షకుడే కార్మికుడు అవుతాడు. ఆ విధంగా చేతినిండా పనిఉంటే అక్కరలేని రాజకీయాలు ఉండవు. కల తలు, కార్పణ్యాలు తగ్గుతాయి. సమతూకం ఏర్పడుతుంది.

ఇప్పుడు సమతూకం చెడింది! పల్లెలు వెలవెల పోతున్నాయి. బస్తీలు 'జామ్' అయిపోతున్నాయి.

చదువుకున్న యువకులు తమ సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయో గించి పల్లెలను ఉత్పత్తి కేంద్రాలుగా మార్చాలి. అలా మార్చిన వారిలో భాగవతుల చారిటబుల్ ట్రస్ట్ పరమేశ్వరరావు ఒకరు. ఆయన కెనడాలో పి.హెచ్.డి. చేసి ఆ దేశానికి అమ్ముడుపోకుండా, తన స్వంత ఊరికి వచ్చారు. కొన్ని పదుల ఊళ్ళను ఉత్పత్తి కేంద్రాలుగా చేశారు.

ఆర్థికంగా స్వయంసమృద్ధి, సేవాపరంగా విద్య, వైద్యం అందిస్తే పల్లె ఒక కల్పవృక్షం అవుతుంది. ఆ పరిశ్రమలలో జాతీయగీత ఆలాప

నతో రోజూ పని ప్రారంభం కావాలి. ప్రజలు కాయకష్టం చేస్తున్న సమయంలో పవిత్ర గీతాలు, ప్రేరణ ఇచ్చే గీతాలు వినిపించాలి. అప్పుడు గాంధీగారు ఆశించిన గ్రామాలు ఆవిర్భవిస్తాయి. యువత అలా నిలబడితే కొద్ది సంవత్సరాలలో రామరాజ్యాన్ని సృష్టించగలం.

కానీ, నేడు స్కూలు భవనాల నిర్మాణంలో ప్రజలు పాల్గొనడం లేదు. కారణం ఆ స్కూలు ప్రజలకు ఎంతవరకు పనికివస్తోంది? డ్రిల్ మాస్టారు, ఎన్. ఎస్.ఎస్. మాస్టారు ప్రజలకు యోగాసనాలు నేర్పితే. టీచర్లు రాత్రిపూట వయోజనవిద్య గరిపితే, తెలుగు మాస్టారు భారత భాగవతాలు చెపితే, ఆటల పోటీలు, ఉత్సవాలు స్కూలు ప్రాంగణంలో జరిపితే-ప్రజలలో అది స్కూలు అన్న భావం వస్తుంది. వారి సహకారం అందుతుంది. అలా ఆత్మీయమైన సెటప్ సృష్టించుకోవాలి.

ప్రస్తుత పరిస్థితిలో గ్రామాలకు పార్టీలతో ప్రమేయంలేని పెద్దలతో సలహాసంఘం ఒకటి ఉండాలి. దాని ఆధ్వర్యంలో యువతరం నిర్వహణకు నడుం కట్టాలి. గ్రామం స్వయం సమృద్ధమైన కళ్యాణ మండపంగా తయారవుతుంది.

యువతరానికి వారి భాషలో చెప్పి ప్రేరణ ఇచ్చే వ్యక్తులు కావాలి. ఆ ప్రేరణతో యువతరం తన ముందుతరం ప్రభావం నుండి బయట పడాలి. దేశశ్రేయస్సుకు ఇదొక్కటే మార్గం.

కానీ, ప్రభుత్వానికి ప్లాన్ లేదు. దూరపు చూపులేదు. గేదెలు లోన్ మీద ఇస్తున్నారు. అవి ఎక్కడ మేయాలి? ఆ పేదవాడు వాటిని చేలమీదకు వదులుతాడు. ఫలితంగా సామాజికమైన ఘర్షణ. ప్రభుత్వ పోరంబోకులో కొన్ని ఎకరాలు ఆ పనికి ఎందుకు కేటాయించకూడదు ?

ఊళ్ళో పాలసేకరణ కేంద్రం ఉంటుంది పాలు దొరకవు. పల్లెకు తృప్తి కలిగించిన తర్వాత పాలు బస్తీకి తీసుకువెళ్ళండి. కూరలు పండు

తాయి బస్తీకి వెళ్ళిపోతాయి. పుచ్చులు మిగులుతాయి. పల్లెలో అమ్మగా మిగిలిన దానిని మాత్రమే బస్తీకి పంపాలన్న ఆలోచన ఎందుకు రాదు? ఆ నీతి పండించేవాడికే, కొనేవాడికే, కళ్ళప్పగించి చూస్తున్న ప్రభుత్వానికే ఉండడం లేదు.

ఇలా గ్రామాలలోని పాత సౌకర్యాలు పీకేస్తున్నాం. కొత్త సౌకర్యాలు ఇవ్వడంలేదు. అవి ఎడారులు అవుతున్నాయి. ఈ పరిస్థితిని మార్చడం కోసం ఉద్యమాలు నడవాలి.

మానవ బలగాన్ని సమీకరించి వినియోగించే పథకం ప్రభుత్వం వద్ద లేదు. ఉంటే ప్రజల సమర్థత, చైతన్యం పెరుగుతాయి. ప్రస్తుత తరం నాయకత్వం నుండి దిగిపోవలసి వస్తుంది. ఆ భయంతోనే వీరు ప్రజలకు ఆ గుణాలు అలవడకుండా మేనేజ్ చేస్తున్నారు. ఎంతకాలం చేస్తారు? అంతకాలం వచ్చింది వాళ్ళకు.

ఇదీ గ్రామసీమల చిత్రం.



# అందరికీ ఆవాస విద్యాలయాలు

## వ్యాపార దృష్టి పెరిగి...అభినయం మిగిలి :

వైద్యం, విద్య అనే వృత్తులు పవిత్రంగా నడుపుకోవలసినవి. అవి దెబ్బతిన్నప్పుడు, వ్యాపార సరళిలోనికి మారినపుడు మిగతా వృత్తులన్నీ దెబ్బతింటాయి. అవి వ్యాపారాలుగా మారడం తల్లి తన చనుబాలను ఉగ్గు గిన్నె ఇంత అని లెక్కకట్టి బిడ్డలకు అమ్ముకోవడమే! నేడు నర్సింగ్ హోమ్‌లకు, లాడ్జీలకు తేడా తెలియడంలేదు. ఫలానా విద్యాసంస్థలో నాకు పార్టనర్ షిప్ ఉన్నది-అని వ్యక్తులు సూచించే పరిస్థితి ఉన్నది. వ్యాపార దృష్టి ఉన్నచోట పవిత్రత ఉండదు. ఆ వాతావరణమూ ఉండదు. అది వైద్యమూ కాదు, విద్యాకాదు. అక్కడ హీలింగ్ పవర్ ఉండదు. ఇక్కడ టీచింగ్ పవర్ ఉండదు. ఉండేది అభినయం మాత్రమే.

విద్యారంగాన్ని పరిశీలిస్తే-ప్రభుత్వ సంస్థలలో నిర్లక్ష్య వైఖరి, ప్రయివేటు సంస్థలలో వ్యాపార సరళి, విదేశీయులు నడిపే సంస్థలలో వ్యాపారం+మతతత్త్వం కనబడుతున్నాయి. జీతం కోసమో, డబ్బు కోసమో, మతం కోసమో నడుస్తున్నాయి తప్ప-అవి విద్యార్థి కోసం నడవడంలేదు. వాలంటరీ విద్యాసంస్థలు, సేవాసంస్థల విద్యాలయాలు నమూనా

లుగా ఉన్నాయి తప్ప, జాతి అవసరాలను తీర్చగలిగే స్థితిలో లేవు. స్వచ్ఛంద సంస్థల సంఖ్య పెరగాలనే మెలకువ ప్రజలలో రావడానికే ఈ విశ్లేషణ.

## వాతావరణమూ లేదు...,మేలుకొలుపూ లేదు:

రెండవ అంశం- విద్యాలయంలో ఒక వాతావరణం ఉండాలి. తాను తిరుగుతున్న వాతావరణంలో విద్యార్థి ఎదుగుతాడు. కుటుంబానికి ఒక సంప్రదాయం, పద్ధతి, ఒక వాతావరణం, ఒక క్రమశిక్షణ ఉండాలి. విద్యాలయానికీ ఉండాలి. వ్యాపార సరళి ప్రవేశిస్తే ఈ వాతావరణం దెబ్బ తింటుంది. కోడిపెట్ట గ్రుడ్డును పొదిగినట్లు వాతావరణం మనిషిని ఎదిగేటట్లు చేస్తుంది. "గురుశుశ్రూషయా విద్యా"- అంటే ఇదే. పెద్దలతో తిరుగుతూ ఉంటే మనకు తెలియకుండానే మనం ఎదుగుతాము. మన కన్ను విచ్చుకుంటుంది. మనలో చూపు పెరుగుతుంది. రామకృష్ణ పరమహంస వివేకానందునికి ఏమి చెప్పాడు? వేదాలు, ఉపనిషత్తులు అప్పజెప్పినవారంతా వివేకానందులు కావడంలేదే! ఆ గురువు నుండి ఆ శిష్యుడు పొందగలిగిన దాన్నే మనవాళ్ళు సాన్నిధ్యం అన్నారు. ఆ సన్నిధి, ఆ వాతావరణం, దానినుండి వచ్చే మేలుకొలుపు అద్భుతమైనవి.

ఇవాళ విద్యాలయాలలో మనకు ఆ వాతావరణం కనబడడంలేదు. ప్రభుత్వ సంస్థలలో అసలులేదు. ప్రయివేటు సంస్థలలో కృతకమైన వాతావరణం కనపడుతున్నది. విద్యాలయం అంటే ఒక దివ్యత్వం, ఒక పవిత్ర వాతావరణం, చూడగానే మనకు నమస్కరించాలని అనిపించడం - ఇవేవీ లేవు. మనిషిని నియమించేది వాతావరణం. మామూలు కాలేజీలలో కూడ స్వరాజ్య సమర సమయంలో రఘుపతి వెంకటరత్నం నాయుడువంటి వారు నిర్వహించిన కాలేజీలు ఎందుకు రాణించాయి? జాతికి పనికివచ్చేవారు ఎలా తయారైనారు? ఒక వాతావరణం, ఒక సాన్నిధ్యం ఉన్నది అక్కడ.

అది విద్యార్థులను పెంచింది. రూపుదిద్దింది. ఆ వాతావరణం కోసమే విద్యార్థులకు ఒక యూనిఫారం; ఉపాధ్యాయులకు ఒక పద్ధతి, గౌరవం, హుందాతనం ఉండేవి అప్పుడు. ఇప్పుడు అవి పోయాయి. ఎవరు ఉపాధ్యాయుడో, ఎవరు విద్యార్థో తెలియని స్థితి వచ్చింది. ఆనాటి వాతావరణం లోపించింది ప్రభుత్వ సంస్థలలో.

ఇక ప్రైవేటు సంస్థలలో బూట్లు, డ్రస్సు అంటూ కృతకమైన వాతావరణం ఉంటున్నది. సరస్వతీ నిలయంలోనికి చెప్పులతో రావడం ఏమిటి ?

**తిరుగుబోతులూ...తిరుగుబాటుదారులూ :**

డిసిప్లిన్ లేకుండా అయినా పోతున్నది. లేదా డిసిప్లిన్ పేరిట అక్కరలేని క్రమశిక్షణ రుద్దబడుతోంది. 'ఐరన్ డిసిప్లిన్' రుద్దబడుతోంది. పూర్తి స్వేచ్ఛ, లేదా పూర్తిగా నొక్కివేయడం. ఈ రెండూ అపచారాలే. అప్పుడు విద్యార్థులు తిరుగుబోతులైనా అవుతారు, రెబెల్సైనా అవుతారు. నిష్ప్రయోజకులైనా అవుతారు భయస్థులైనా అవుతారు. ఉపాధ్యాయుడంటే గౌరవం, ఆరాధనా భావం పోయి భయం పెరిగితే ఇక విద్య ఏమి వస్తుంది? ఆ భయం ప్రమాదకరం. అది వారిద్దరినీ దూరం చేస్తుంది. ఈ విధంగా విద్యాసంస్థలు విద్యార్థులకు విద్య ఇవ్వడం మాట అటుంచి, వారి జీవితాలను రూపుదిద్దే అవకాశాన్ని కోల్పోతున్నాయి.

ఇక శీల నిర్మాణానికి మనం పాఠాలు చెపితే చాలదు. శీలం ఉన్న వాడు చెపితేనే అది అర్థమవుతుంది. పాఠం అప్పజెప్పితే ప్రయోజనంలేదు. ఉపాధ్యాయులుగా ఎన్నిక చేయబడినవారిలో మహిమాన్వితులు ఉండడం చేత స్వాతంత్ర్య సంగ్రామ సమయంలోను, ఆ తర్వాత కొద్దికాలం వరకు జాతికి పనికివచ్చేవారు తయారయ్యారు - వనరులు ఉన్నా లేకున్నా. ఈ రోజున మహిమాన్వితులైన అధ్యాపకులు లేని కారణాన, మనకు అన్ని సౌకర్యాలు ఉన్నా జాతికి అవసరమైన వ్యక్తులు తయారు కావడంలేదు,

## టీచరుకు విద్యార్థి గమ్యం కావాలి :

విద్యార్థి నాకు గమ్యం అనే వ్యక్తిని కాక ఉద్యోగం నాకు గమ్యం అనే వ్యక్తిని ఉపాధ్యాయుడుగా నియమిస్తే-అతడు తన వృత్తికి న్యాయం చేయడు. ఈ వృత్తిలోకి ఏమీ చేతకానివాడైనా వస్తున్నాడు. సత్తా ఉన్నవాడు వస్తే ట్యూషన్‌లు చెప్పుకుంటూ వ్యాపారస్తుడుగానైనా మారిపోతున్నాడు. ఈ ఇద్దరూ శీల నిర్మాణానికి పనికిరారు. ట్యూషన్లు చెప్పవద్దు అంటే కాలేజీలో పాఠం చెప్పాలని లేదుకదా.

కనుక బోధన స్వధర్మం అయినవారిని, బోధన కోసమే పుట్టిన వారిని మాత్రమే ఉపాధ్యాయులుగా తీసుకోవాలి. పరధర్మో భయావహః· అది స్వధర్మం కానివాడు దాన్ని పూర్తిగా అమ్మేసుకొంటాడు. ఎంపిక చేయడంలోనే జాగ్రత్తపడాలి తప్ప — ఆ తర్వాత మనం ఎన్ని ఆంక్షలు పెడితే అతనికి అన్ని కాంక్షలు పెరిగి అన్ని పక్కదారులు వెతుకుతాడు. ఉపాధ్యాయులుగా ఉండే జాతిమొత్తాన్ని మేలుకొలిపిన నాయకులు ఎందరు లేరు? తిరుపతి వెంకటకవులు టీచర్లు కారా? మునిమాణిక్యం నరసింహారావుగారు తన హాస్యాన్ని పిల్లలను తీర్చిదిద్దడంలో ఉపయోగించినారని చెపుతారు. వాళ్ళను ఇంటికి పిలిపించి, రకరకాలుగా కథలు చెప్పి, వారిని మలచేవారు. ఆనాటి అధ్యాపకులు అలా బాధ్యత పడేవారు.

## విద్యార్థి లోకంలో విషాద యోగం :

మూడవ అంశం. నేటి విద్యార్థులు క్రమశిక్షణను ఎందుకు పాటించడంలేదు? ఈ విద్యవల్ల ఒరిగేది ఏమిటి అన్న ప్రశ్న అతనికి వస్తున్నది. ఎన్ని ఎమ్.ఏలు చేసినా ఆ తర్వాత ఏమిటి అన్న ప్రశ్న మిగిలిపోతున్నది విద్య జీవితానికి సరిగా దారి చూపలేకపోతున్నది అనే భావన అజ్ఞాతంగా అంతర్లీనంగా పనిచేసి, విద్యార్థిలో రెక్‌లెస్‌నెస్‌ను, కేర్‌లెస్‌నెస్‌ను సృష్టిస్తోంది. ఈ నైరాశ్యంలో నుండి అల్లరి పుడుతోంది.

ప్రవృత్తి నిర్మాణంలో కాని, వృత్తి నిర్మాణంలో కాని, విద్య అంతగా సహకరించడం లేదని తెలిసిపోతే, దానిపట్ల నిర్లక్ష్యం వచ్చేస్తుంది.

ఆ విద్యార్థిని నిలదీసి అడిగితే-సార్! ఈ చదువు అయిన తర్వాత నేను ఎలాగూ పనికిరానివాడుగా తయారయేవాడినే కదా. ఈ రెండేళ్ళయినా నన్నిలా నవ్వనీయండి సార్' అంటాడు. మరొక్కమాట. విద్యార్థిగా ఉన్నప్పుడు అతడు ఎంత రెచ్చిపోతాడో, నిరుద్యోగిగా ఉన్నప్పుడు అంత డీలా పడిపోతాడు. కనుకనే కొందరు ఒక డిగ్రీ తర్వాత మరొక డిగ్రీ, ఆ తర్వాత మరో డిప్లమా చదువుతూ విద్యార్థి జీవితాన్ని కొనసాగిస్తున్నారు.

ఇలా ఒక రకమైన విషాదయోగం ఈ అల్లరి వెనుక ఉన్నదా?

ఈ విధంగా ఉపాధ్యాయులు వారికి ప్రేరణ ఇవ్వలేకపోతున్నారు. విద్య వారికి ప్రేరణ ఇవ్వలేకపోతున్నది. విద్య తర్వాత పరిస్థితులు ఆశాజనకంగా లేవు. ఇందులోనుంచి ఒక నిర్లక్ష్య వైఖరి వస్తున్నది.

మరో విషయం. పల్లెటూరునుండి వచ్చి చదువుతున్న వారుంటారు. డబ్బు వాళ్ళ చేతుల్లో ఆడుతూ ఉంటుంది. ఈ చదువువల్ల పొందేదేమీ లేదని అతడికి తెలుసు. కనుక ఈ కాలాన్ని సరదాగా గడిపేద్దాం అనే ధోరణి వస్తుంది. పంజరంలో నుండి బయటకు వచ్చిన చిలకలా ఒక స్వేచ్ఛ. వాడిపై రకరకాల అభిరుచులు ప్రభావాలు పడి వాడు పాడైపోయి వెళ్ళిపోతున్నాడు.

## ఇచ్చే సౌకర్యాలు ఏమౌతున్నాయి :

ఇది ఇలా ఉండగా- ప్రభుత్వ విధానాలవల్ల కూడా విద్యావ్యవస్థ కొంత పాడయింది. రిజర్వేషన్లు ఉండడం బాగానే ఉంది కాని- ఇచ్చిన అవకాశాన్ని అతను ఎలా ఉపయోగించుకుంటున్నాడనే 'చెకింగ్' ఉండటం లేదు. అది తప్పు. సద్వినియోగం చేసుకోకపోతే ఈ అవకాశాలు ఛేజారి

పోతాయేమో అన్న భయం అతనికి కలిగించలేక పోవడం తప్పు. శిక్షణ లేని మనస్సుకు సౌకర్యాలు ఎక్కువయ్యేసరికి- వాడు వక్రమార్గం పడుతున్నాడు. 'పాకెట్ మనీ' అందిన రోజున హాస్టళ్ళలో ఎన్ని బాటిల్స్ పగులుతాయో మనకు తెలుసు.

తల్లిదండ్రులు చదువుకొన్న వారు అయితే అతడిని కొంత అదుపు చేస్తారు. తల్లిదండ్రులు నిరక్ష్యరాస్యులు అయితే పిల్లవాడు చదువుతున్నాడని మురిసిపోతారు. వీడు విజృంభిస్తాడు. తల్లిదండ్రుల అదుపులేదు. ప్రభుత్వపు అదుపులేదు. విద్యాలయాలు పట్టించుకోవు. విషమ ఫలితాలు రావడంలో ఆశ్చర్యం ఏమున్నది? విద్యాగంధం లేనివాడికి శీల సంపద కూడా లేకుండా చేస్తున్నాయా మన విధానాలు వాటి అమలు ?

## మెదడును మాడ్చివేసే పరీక్షల టెన్షన్ :

పోనీ ఆ చెప్పే నాలుగు ముక్కలయినా విద్యార్థికి అంటుతాయా అంటే-పరీక్షా విధానం దుర్భరమైనస్థితిలో ఉండటంవల్ల అదీ జరగడంలేదు. ఆ విధానం నిష్ఠగా 'చదువుకు'నే వాడి బ్రెయిన్ కాలిపోవడానికి, మాడిపోవడానికి పనికివస్తున్నది. ఎందుకంటే - పరీక్షకోసం, మార్కుల కోసం చదివే చదువును విద్యార్థి 'ఎన్‌జాయ్' చేయలేడు. టెన్షన్ మిగులుతుంది. మార్కులే గమ్యం అయినపుడు పాఠం ఎంత మంచిదయినా ప్రయోజనం ఉండదు. బట్టీ పడతాడు తప్ప, 'ఇన్‌స్పైర్' కాడు. ఆ నాలుగు ముక్కలూ ముక్కున పెట్టుకొని అప్పజెపుతాడు. వాటి రుచిని మాత్రం అనుభవించలేడు. విద్యార్థికీ, పాఠానికీ మధ్య 'పరీక్ష దృష్టి' అనే పొర ఏర్పడుతోంది. నిష్ఠగా చదివేవాడి బ్రెయిన్ స్ట్రెయిన్ అవుతున్నది. నిర్లక్ష్య వైఖరితో ఉన్నవాడు కాపీలూ వాటితోపాటు చిన్న కత్తి పట్టుకు వెళుతున్నాడు.

ఇక - యూనివర్శిటీ స్థాయిలో సైతం మేము చెప్పిన నోట్స్ వ్రాయాలని అధ్యాపకులు అనడంతో, విద్యార్థి సృజనాత్మకత చచ్చిపోతున్నది.

ఇలా సృజనాత్మకతకూ, మానసిక వికాసానికీ దోహదంచేయని ఒక కూలి పనిగా తయారయింది విద్య. పరిశ్రమగా తయారయింది విద్య. కాలేజీలనుండి బయటకు వస్తున్న బి. ఏ. లూ, ఎమ్. ఏ. లూ వాడేసి బయటకు పారవేసిన కార్బన్ పేపర్లు. వాళ్ళు ఎందుకూ పనికిరారు. అలా బయటకు వచ్చే విద్యార్థికి తెలివిలేదు. సృజనాత్మకత లేదు. సమర్థత లేదు. లోకజ్ఞత లేదు. అతడు స్వంతంగా పనిచేయలేడు. స్వంతంగా ఆలోచించలేడు. స్వంతంగా ఏమీ సాధించలేడు. అతనికి జీవితం అంటే భయం వేస్తోంది.

## సృజనాత్మకతకు శాశ్వత సమాధి :

ఇంతా చేసి మీ పరీక్ష జ్ఞాపకశక్తికి మాత్రమే పరీక్ష. అతడి గ్రహణశక్తి, సృజనాత్మకత, 'ఎపేకినింగ్', భావనాశక్తి. నేర్చుకొన్న అంశాలను జీవితానికి అన్వయించుకునే శక్తి - ఇవేవీ చూడనక్కరలేదా? జ్ఞాపకశక్తిని మాత్రమే పరీక్షించి, ఇతడు గ్రాడ్యుయేట్, పోస్టుగ్రాడ్యుయేట్ అనడం వంచనకాదా ?

విద్యార్థులను 'ఇన్‌స్పైర్' చేయడం మన కర్తవ్యం అన్న విధానం పోయి, వారిని పరీక్షకు తయారుచేయాలి అనే ఆలోచన ఉపాధ్యాయులలో ప్రవేశించినపుడే విద్యావిధానం దెబ్బతిన్నది. విషయం నాకు బాగా తెలిసింది- అనే ఆత్మ విశ్వాసం కలిగిన విద్యార్థి పరీక్షను అవలీలగా వ్రాయగలడు. ఆ ఆత్మ విశ్వాసాన్ని కలిగించడానికి ప్రాధాన్యం ఇవ్వాలి. పరీక్ష సెకండరీ కావాలి.

ఎన్ని ఎక్కువ టెస్టులు పెడితే అంత గొప్ప కాన్వెంట్ అని పేరు వస్తున్నది. ఎంత దారుణం! నిజమైన పరీక్ష జరగాలి తప్ప పెట్ట కూడదు. విద్యార్థికి తెలియకుండానే పరీక్ష జరగాలి. పెళ్ళి చూపులలో అసలు అందం తెలియదు. ముందు చెప్పకుండా వెళ్ళి చూస్తే తెలుస్తుంది. చెప్పిచూస్తే, అభినయం కనపడుతుంది.

విద్యార్థి యొక్క మానసిక వికాసం, వృత్తి, ప్రవృత్తి, హృదయం అనే అనేక అంశాలను దృష్టిలో పెట్టుకుని పరీక్ష జరగాలి.

## ప్రవృత్తి శిక్షణకు సాధనం సాహిత్యం :

కాగా - విద్యలో సాహిత్యం పాత్రనుకూడా గుర్తించవలసి ఉన్నది.

సాహిత్యం మనస్సును ఆర్ద్రం చేస్తుంది. రిలాక్సేషన్‌తో మొదలు పెట్టి రియలైజేషన్ వరకు తీసుకువెళుతుంది. పొలంలో పనిచేసే రైతు "చెల్లియో చెల్లకో...." అంటూ పనికి బయలుదేరుతున్నాడు. "అయినను పోయిరావలయు హస్తినకు...." అంటూ తిరిగి వస్తున్నాడు. కూలీలు పాట పాడుతూ నాట్లు వేస్తారు కోత పాటలు ఉంటాయి. పని ఉన్న చోట సాహిత్యం ఉండాలి.

సాహిత్యం లేకపోతే మనస్సుకు లూబ్రికేషన్ లేదు. వికాసంలేదు. తత్త్వ దర్శనం అయ్యే అవకాశంలేదు.

కనుక-వృత్తి విద్యలతో సాహిత్యాన్ని మేళవిస్తే రెండు పనులు జరుగుతాయి. అలసి వచ్చినవాడు రిలాక్స్ అవుతాడు. ప్రవృత్తి శిక్షణ జరుగుతుంది. గ్రూప్ రూపంలో వృత్తి శిక్షణ, సాహిత్యం రూపంలో ప్రవృత్తి శిక్షణ జరగాలి.

ప్రవృత్తి శిక్షణ ఇచ్చినట్లయితే వ్యక్తులలో వ్యాపార సరళి ఏర్పడదు.

జీవికకు పనికివచ్చేది వృత్తి. జీవన విధానాన్ని తీర్చిదిద్దేది సాహిత్యం. ఈ రెంటికీ అనుసంధానంగా చరిత్ర, రాజనీతి శాస్త్రం మొదలైనవి ఉండాలి. గ్రూపులకూ, ఆర్టునకూ అనుసంధానం జరగాలి.

మానవుడు మనస్సుతో జీవించవలసినవాడు. యంత్రం కాదు. ప్రవృత్తి శిక్షణ లేకపోతే అతడు అలసి పోతాడు. అతనికి తృప్తి ఉండదు.

నేడు ఆర్ట్సు చదువుకునే వారికి వృత్తి లేకుండా చేస్తున్నారు. గ్రూపు చదువుకునే వారికి సాహిత్య గంధం అంటకుండా చేస్తున్నారు. వాడికి జీవించగలను అనే ధైర్యం ఉండడంలేదు. వీడికి జీవించడానికి కావలసిన వికాసం ఉండడంలేదు.

## 'నీ బొమ్మలకు ప్రేరణ ఎక్కడిది ?'

ఒకసారి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఫైన్ ఆర్ట్సు శాఖ ప్రారంభించారు. ఆ సిలబస్‌లో తెలుగు, ఇంగ్లీషు కూడా పెట్టారు. 'మాకు తెలుగు ఎందుకండీ'— అన్నారు ఆ విద్యార్థులు. 'నీవు బొమ్మలు ఎక్కడ నుంచి వేస్తావు ? ఒక రఘువంశంలో, ఒక కుమార సంభవంలో ఒక్కొక్క శ్లోకంలో ఒక్కొక్క చిత్రం వేశాడు అక్షరాలలో. అవి తెలియకుండా నీవు బొమ్మలు ఎలా వేస్తావు ? నీకు ప్రేరణ ఎక్కడనుండి వస్తుంది ? మహనీయుల మధురమైన విశ్వదర్శనంతో నీ మనస్సు పులకిస్తే, ఆ పులకింతలో నీ కుంచె కదిలితే— ఏదైనా 'టెక్స్ట్' ఉన్న చిత్రం రావాలి. పునాదులు లేకుండా కడితే క్రుంగిపోతుంది మీ కళా సౌధం'-అని సమాధానం ఇవ్వవలసివచ్చింది.

నిజమే. కుమార సంభవం, మేఘసందేశం, రఘువంశం ఎలా వ్రాశారు ? ఎన్నివేల జన్మలు ఎత్తితే మనకు అలాంటి భావం వస్తుంది ? అలాంటి అనుభూతి కలుగుతుంది ? అలాంటి దర్శనం లభిస్తుంది ?

సాహిత్యం సహృదయ రంజకం. అనుభూతి చెందడం, ఆనందించడం మానవ జన్మకు సార్థకత. కనుక సాహిత్యం చదవాలి. ఏమున్నది బ్రతుకుకు అర్థం అది లేకపోతే ? 'మెంటల్ బీయింగ్'గా అతడి జీవితం ఏమున్నది ? మనం యాంత్రికం అయిపోతున్నాం- అని విచారిస్తే ఏమి లాభం ?

## త్రిభాషా సూత్రానికి ఒక సవరణ

మరో విషయం బోధనా మాధ్యమం. చిన్నతనంలో బోధన మాతృభాషలోనే జరగాలి. లేకపోతే విషయంకన్న మీడియం మరింత బరువవుతుంది. పారిభాషిక పదాలను మాత్రం ఒకలాగే ఉంచితే, పదవ తరగతి తర్వాత బోధన ఇంగ్లీషులోకి మారినా, మరో భాషలోకి మారినా ఇబ్బంది ఉండదు.

అలాగే, ప్రతి విద్యార్థికీ సంస్కృతం, మాతృభాష, ఆంగ్లభాష రావాలి. మానవుడు ఇంతవరకు సాధించిన మొత్తం విజ్ఞానం సంస్కృతంలో ఉన్నది. సంస్కృతం రాకపోతే గతానికీ మనకూ మధ్య తలుపు మూసుకుపోతుంది. మనిషి కుండీమొక్క అయిపోతాడు. మన సంస్కృతి అనే పునాదిమీద మనం బ్రతుకుతున్నాం. అది 'కట్ ఆఫ్' అయితే, మనం జీవచ్ఛవాలం అయిపోతాం.

ఆంగ్లం కూడా వచ్చి తీరాలి ఎందుకంటే- ఇటీవల కాలంలో వస్తున్న అభివృద్ధి అంతా ఆంగ్లంలో రికార్డయి వస్తున్నది. అది ప్రపంచ భాషగా గుర్తింపబడింది.

## హోమ్‌వర్క్ ఇవ్వడం పూర్తిగా అశాస్త్రీయం

మరో అంశం. మూడవ తరగతి వరకు పిల్లలకు ఎక్కువ వ్రాత పని పెట్టకూడదు. వ్రాసి తీరాలి అంటే, వ్రాతపని రోతపని అవుతుంది. వాళ్ళకు హోమ్‌వర్క్ ఇవ్వడం ఆరోగ్యకరంకాదు. హోమ్ వర్క్‌తో

ఆ మొగ్గలను నలిపివేస్తున్నాం మనం. నిప్పుల కుంపటిలో పడవేస్తున్నాం. నోటికి చెపితే వచ్చే వయస్సులో చేతికి చెప్పడమేమిటి ? మూడవ తరగతి వరకు హోమ్‌వర్క్ ఇవ్వడం పూర్తిగా అశాస్త్రీయం. ఇస్తే పిల్లలు ఏడ్చి, క్షోభ అనుభవిస్తారు. వాళ్ళకు హోమ్‌వర్క్ పూర్తికాక కలలో కూడ టీచర్ బెత్తంపుచ్చుకొని కనపడుతుంది. హోమ్ వర్క్ అంటే ఇంటిలో అంద రికీవర్క్.

అంతే కాదు. పిల్లలు 'మూడ్'లో లేకపోతే వాళ్ళకు చదువు చెప్పకూడదు. ఎంత మంచి విషయం అయినా 'రిసీవింగ్ పోల్' అక్కడ లేనప్పుడు చెప్పి ఏం లాభం ?

## మనిషిలోని ప్రజ్ఞను వెలిగించేదే విద్య

కాగా— నేడు విద్యా ప్రమాణాలు పెంచాలనే ఉద్దేశంతో సిలబస్‌లు, పుస్తకాల బరువు పెంచుతున్నారు. లారీకి బస్తాలను కూరినట్లు ఇన్‌ఫర్మేషన్ కూరుతున్నారు విద్యార్థి మెదడులోకి. ఇది విద్యార్థికీ, అధ్యాపకునికీ మోయలేని బరువు అవుతున్నది. విద్యార్థి ఆ బరువుకు అణగిపోతున్నాడు. నిజానికి- విద్యార్థిలోని ప్రజ్ఞను మేలుకొలపడానికి ఆ పాఠం ఉపకరించాలి. అగ్గిపుల్ల గీస్తాం. వెలగగానే గీయడం ఆపేస్తాం. అలాగే, విద్య మనిషి లోని ప్రజ్ఞను వెలిగించాలి. ఆ పని సున్నితంగా, నాజూకుగా ఇన్ స్పైరింగ్‌గా ఉండాలితప్ప—'పనిషింగ్'గా ఉండకూడదు. నేటి విధానంలో సైన్స్ టీచర్లు పెరుగుతారు తప్ప సైంటిస్టులు పెరగరు.

## వెలుగును కర్తవ్యంగా మార్చేందుకు యోగం

మనిషిలోని వెలుగు కర్తవ్య రూపంలో వ్యక్తమయ్యేటట్లు చేసేదే విద్య. అతడి శరీరం, ఇంద్రియాలు, మనస్సు అందుకు వినియోగం కావాలి. తన జీవ లక్షణాన్ని సద్వినియోగం చేసుకునే పాత్రత, తాను దేనికి దిగివచ్చాడో ఆ కర్తవ్యం మీద తన సర్వశక్తులనూ ఫోకస్ చేసే

పాత్రత మనిషికి అలవడాలి. అతడి జీవ లక్షణానికి అనుగుణమైన శిక్షణ అతనికి అందాలి. ఇందుకోసం యోగ విద్య అవసరం.

ఎవరి జీవ లక్షణం ప్రకారం వారు కర్తవ్య నిర్వహణ చేస్తున్నప్పుడు పోటీ ప్రసక్తి రాదు. ఈ పోటీ మానవసృష్టి, మన భ్రమ, దైవ సృష్టిలో లేనిదిది. ఈ సృష్టిలో ఎవరికి ఎవరూ ప్రత్యామ్నాయం కాజాలరు. దీన్ని గుర్తించినపుడు మనిషి కాంపిటీషన్ నుండి కో ఆపరేషన్ వరకు ప్రయాణం చేయగలుగుతాడు. విశ్వానికి మిత్రుడు, సేవకుడు అవుతాడు. 'అవర్ బర్త్ ఈజ్ అవర్ ఎంప్లాయ్‌మెంట్'. మనం ఈ భూమిమీదకుదిగి వచ్చిందే ఒక ప్రత్యేకమైన పనిమీద. ఆ పని ఏమిటో గ్రహింపజేసి, దానికి తగిన శిక్షణ ఇచ్చేదే విద్యాలయం.

## కుటుంబానికీ సమాజానికీ దూరంగా...

కాగా, విద్యార్థిపై మూడు రకాల ప్రభావాలు పడుతూ ఉంటాయి. ఇల్లు, విద్యాలయం, సాంఘిక పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడే విద్యార్థి సరి అయిన పద్ధతిలో తయారయ్యే అవకాశం ఏర్పడుతుంది.

తల్లిదండ్రులు టీవీ చూస్తూ పిల్లలను చదువుకోమంటారు. వారు తల్లిదండ్రులుగా ఉండడం మానేసి తలుపులు వేసుకొని భార్యాభర్తలుగా ఉంటూ ఉంటే - గృహంలో వాతావరణం ఎలా ఉంటుంది ? అతనిమీద ఎలాంటి ముద్రలు పడతాయి ? తల్లిదండ్రుల అబద్ధాలు, నాటకాలు అతడి కళ్ళముందు పడుతూ వుంటే, తాను చదివే పాఠాలకు, వారి ప్రవర్తనకు పొంతన కుదరకపోతే అతడి మనస్సు ఎలా ఉంటుంది ?

విద్యాలయాలలోని వాతావరణం గురించి మనం పైన చెప్పుకున్నాం. పైగా విద్యాలయంలో అతడు కొంతసేపే ఉంటున్నాడు. అక్కడ వాళ్ళు అతనికి చెప్పినవారు అవుతున్నారు తప్ప, అతడిచేత అమలు చేయించలేక పోతున్నారు. దానికి 'ఫాలో అప్' కనబడడం లేదు. ఉపాధ్యాయులు

కూడా ఈ సమాజంలో బ్రతుకుతూ అక్కడకు వస్తున్నవారే. అవే పాలిటిక్స్, అవే వర్గాలు, అవే ముఠాలు అక్కడకూ వస్తున్నాయి. విద్యార్థులు సమాజంలో నుంచి వెళుతున్నారు. ఉపాధ్యాయులు సమాజం నుంచి వెళుతున్నారు. కనుక, సమాజంలోని ఒడిదుడుకులు అన్నీ విద్యాలయంలో కొనసాగుతున్నాయి. ప్రతిబింబిస్తున్నాయి. కళాశాల సమాజానికి ప్రతినిధి అవుతున్నది.

## సమాజానికి ఎసెట్‌లను అందించిన గురుకులాలు :

ఈ స్థితిని ఊహించే మన పెద్దలు ఇలాంటి పరిస్థితులకు దూరంగా గురుకులాలు పెట్టారు. ఉపాధ్యాయులు అక్కడే ఉండాలి. విద్యార్థులు తల్లిదండ్రులను విడిచి అక్కడే ఉండాలి. తల్లిదండ్రుల ప్రభావం, సమాజ ప్రభావం వారిమీద ఉండదు. ఉపాధ్యాయులు కూడ సమాజానికి దూరంగా ఉంచబడ్డారు. వారు విద్యార్థుల కోసం మాత్రమే బ్రతుకుతున్నారు. విద్యార్థిని 24 గంటలూ గమనించడానికి ఉపాధ్యాయునికి అవకాశం లభించింది. ఇలా, వయస్సు వచ్చే వరకూ ఆ విద్యార్థిని చక్కగా పరిశీలించి, రూపు దిద్ది, అతడికి కావలసిన వృత్తిని, ప్రవృత్తిని అందించి, సమాజానికి ఒక 'ఎసెట్'గా విద్యార్థిని మలచారు. గురుకులాలు స్నాతకోత్సవాలు జరుపుకొనే సమయంలో ఆ విద్యార్థులను చూచి సమాజం పొంగిపోయేది. సమాజానికి కావలసిన సేవకులు, సాధకులు వస్తున్నారని, తమ తర్వాతి తరం బలిష్ఠము, బలీయము అయి తిరిగి వస్తున్నదని గర్వించేది. ఊహ తెలియని స్థితిలో విద్యార్థిగా స్వీకరించి, సమాజానికి పనికివచ్చే స్థితిలో అతడిని సమాజానికి అందించింది గురుకులం.

ఇవాళ స్నాతకోత్సవంతో విద్యార్థులు బయటకు వస్తున్నారంటే, సమాజం భయపడిపోతోంది-ఇంతమంది నిరుద్యోగులు వస్తున్నారని.

## అందరి కోసం ఆవాస విద్యాలయాలు :

అయితే ఈ మధ్యకాలంలో ఆ 'పర్సస్' గమనించి, రెసిడెన్షియల్ పాఠశాలలకు 'ప్రిఫరెన్స్' ఇస్తున్నారు. గురుకుల వాతావరణానికి దగ్గరకు వెళ్ళే ప్రయత్నమే అది. ఆ పాఠశాలలలో రిజల్ట్స్ బాగా వస్తున్నాయి కూడా.

కాని ప్రయివేటు రెసిడెన్షియల్ పాఠశాలలు ధనవంతులకు మాత్రమే అందుబాటులో ఉంటున్నాయి. ప్రభుత్వం నడిపేవి బడుగువర్గాలకు మాత్రమే అందుబాటులో ఉంటున్నాయి. మరి మధ్య తరగతి వ్యక్తి ఏమి కావాలి? వీళ్ళిద్దరి మధ్య నలిగిపోతున్నాడు అతడు.

అందుకే పూర్వం గురుకులాలలో స్టేటస్‌తో నిమిత్తం లేకుండా అందరినీ చేర్చుకొనేవారు. రాజు ఆగురుకుల పోషణ చూసుకొనేవాడు. తల్లి దండ్రులు ఫీజు కట్టే ప్రసక్తి లేదు. యుగాల తరబడి ఎంత తపస్సు చేసి చేసిన ఏర్పాటది!

కనుక, ఆవాస విద్యాలయాలలో ధనాన్ని బట్టి, కులాన్ని బట్టి కాక అందరికీ చోటు ఉండాలి. అక్షరాస్యత అందరికీ వచ్చేవరకూ 'కామన్ ఎడ్యుకేషన్' ఉండాలి ఆ తర్వాత మాత్రం ఎవరి అభిరుచులను బట్టి వారికి విద్య లభ్యమయ్యేటట్లు చూడాలి. అభిరుచులను గమనించి శిక్షణ ఇస్తే-వజ్రాలను, రత్నాలను మనం తయారు చేసుకోవచ్చు. మనం 'మాన్ పవర్'ను వినియోగించుకున్న వాళ్ళం అవుతాం.

ఆ కృషిని సమన్వయించుకుని విద్యా విధానాన్ని తీర్చిదిద్దుకొంటే, మనం ప్రపంచానికి మార్గాన్ని నిర్దేశించగలం. ఆ ప్రకారం మనం గురుకులాల వంటి ఆవాస విద్యాలయాలను రూపొందించుకొన్నరోజున ఒక్కొక్కరిని ఒక్కొక్క నాయకుడుగా, హీరోగా తీర్చిదిద్దగలుగుతాం. విద్యార్థి జీవ లక్షణానికి పదును పెట్టి, అతడి జీవితాన్ని వికసింపజేసే విద్యా విధానాన్ని మనం రూపుదిద్దుకో గలుగుతాం.

# పరిపూర్ణత వైపుగా....

"ఈ సృష్టిని చిన్నచూపు చూడవద్దు. నిన్ను కూడ నీవు చిన్నచూపు చూచుకోవద్దు." అన్నది మాస్టర్ సి.వి.వి. సందేశాలలో ఒకటి.

నేటి సమాజానికి ఈ సందేశం ఎంతయినా అవసరం. ఎందువల్ల నంటే మానవులలో ఎక్కువ మంది ఈ సృష్టిని నశించిపోయేదిగా తృణీకరిస్తున్నారు. అంతేగాక తమను తాము అర్భకులుగా భావిస్తూ లేని అల్పత్వాన్ని ఆపాదించుకుంటున్నారు. ఈ సృష్టికి నిండుదనం రావాలన్నా ఈ సమాజం అన్ని విధాలా అభివృద్ధి చెందాలన్నా కూడని ఈ భావననుండి మానవుడు బయట పడటం ఎంతయినా అవసరం.

సృష్టి అశాశ్వతమైనదే కావచ్చు. అయితే అశాశ్వతంగా అగపడుతున్న ఈ సృష్టి అగుపించని ఆ 'శాశ్వతం'నుండి వ్యక్తమవుతున్నదేనని మనం మరచిపోకూడదు.

అశాశ్వతమని మనమంటున్నది ఆ 'శాశ్వతం' నుండి వ్యక్తమవుతున్నదే! ఆ శాశ్వతం యొక్క వైభవమంతా ఈ అశాశ్వతానికి కూడా సంక్రమించవలసినదే!

అశాశ్వతం నుండి ఆ శాశ్వతంలోనికి పారిపోదామనుకునే బదులు ఆ శాశ్వతం యొక్క పరిపూర్ణత్వాన్ని ఈ అశాశ్వతంలో కూడ ప్రతిఫలింపజేస్తే, పరిమళింపజేస్తే ఎంత బాగుంటుంది!

మానవుడు దేవుడి దగ్గరకు వెళ్ళిపోవడం కాదు కావలసింది. దేవుడు మానవుడి ద్వారా వ్యక్తం కావడమన్నది జరుగవలసి ఉంది.

దేవుడు మానవుడి ద్వారా వ్యక్తం కావాలి. మానవత్వమనే మొగ్గ దివ్యత్వమనే పుష్పంగా వికసించాలి. మానవుడు దేవుడై ఈ సృష్టిలో నడయాడాలి.

ఏ తండ్రయినా ఏమి కోరుకుంటాడు! తన బిడ్డ తనంత వాడు కావాలని కోరుకుంటాడు. ఇంకా చెప్పాలీ అంటే తనను మించిపోవాలని కోరుకుంటాడు. సృష్టికి తండ్రి అయిన దైవం కూడా తన బిడ్డ అయిన మానవుని నుండి అదే ఆపేక్షిస్తున్నాడు.

"మానవుడా! నీవు నా అంత వాడవు కావాలి! ఈ సృష్టిని నా రాజ్యంగా తీర్చిదిద్దాలి. నీవే నేనుగా, నేనే నీవుగా సృష్టి కథను ముందుకు నడపడమన్నది జరగాలి. నా మీద భారం వేసి కూర్చుండిపోవడం కాదు నీవు చేయవలసింది నా యెడల సమర్పణ చెంది, నా శక్తియుక్తులు నీవిగా చేసికొని, నా అంత వాడివిగా, నా వాడివిగా, నాతో కలసి ఈ సృష్టి కార్యక్రమాన్ని నిర్వహించాలి" ఇది మానవుని వెన్నుతడుతూ దైవం చెబుతూ వస్తున్న మాటలు.

మొదట దేవుడు ఒక్కడే ఉన్నాడు. ఆయనకు అలా ఉండటం నచ్చలేదు. తాను అనేకంగా కావాలని కోరుకున్నాడు. అప్పటినుండి ఈ సృష్టి ఇలా వ్యక్తమవడం ప్రారంభమైంది. సృష్టి అతని యొక్క వ్యక్త రూపమై అతని వైభవాన్ని ప్రకటించడం ప్రారంభించింది.

ఈ సృష్టి భగవంతుని యొక్క మహాకామంనుండి అనగా పవిత్రమైన అతని కోరికనుండి వ్యక్తమవుతూ ఉన్నది. అతడినుండి వ్యక్తమవుతూ ఈ రూపాలుగా ఈ సృష్టిలోనికి ప్రవేశిస్తున్న మనంకూడ సృష్టికర్తయొక్క ఆ పవిత్రమైన కోరికకు అనుగుణంగా ప్రవర్తించవలసి ఉంది.

అతని లాగానే మనంకూడా 'ఈ సృష్టి వర్ధిల్లాలి' అని కోరుకోవాలి. మనకు ఈయబడిన ఈ నామరూపాలనూ శక్తి యుక్తులనూ ఈ సృష్టి వర్ధిల్లడం కొరకు వెచ్చించాలి.

ఈ సృష్టి ఒక మహాయజ్ఞం. ఈ యజ్ఞంలో మనమూ పాలుపంచుకోవాలి. 'యజ్ఞార్థదృష్టిని అలవరచుకోండి' అన్న శ్రీ కృష్ణుని వాక్యానికి అర్థమిదే !

మన కొరకని కాక సృష్టికొరకని బ్రతుకుదాం. అప్పుడు ఈ జన్మకర్మలు దివ్యత్వాన్ని సంతరించుకొంటాయి ! అంటాడు గీతాచార్యుడు.

అలాంటి స్థితిలో నిలబడి జీవిస్తున్నప్పుడు మననుండి జరుగుతున్నది సృష్టికర్మ అవుతున్నది. స్వాంతకర్మ అన్నది ఇక ఉండదు. కర్మబంధమన్నది అసలు ఏర్పడదు. దైవం ఈ సృష్టిని ఎలా నిర్వహిస్తున్నాడో ఈ సృష్టిలోని మన పాత్రను మనమూ అలా నిర్వహించగలుగుతాము.

'నేనెలా చేస్తున్నానోచూడు. నీవూ అలా చేయి' అంటున్నాడు దైవం. ఆ వాక్కును మనం అందుకోవాలి. ఆయనకు మనం అన్నివిధాలా అంది రావాలి.

మిగిలిన జీవులు ప్రకృతికి అనుగుణంగా తమ జీవితాలను సాగించవలసినది. మానవుడు మాత్రం దైవానికి అనుగుణంగా ప్రకృతితో ప్రవర్తించవలసినవాడు. "జంతూనాం నరజన్మ దుర్లభం" అని ఆదిశంకరులు అనడంలోని ఔచిత్యమిదే !

మానవుడు తాను పరిపూర్ణుడు కావాలి. ఈసృష్టిని పరిపూర్ణత్వం వైపుకు నడిపించాలి. అప్పుడు దైవం మానవుణ్ణి చూచి ముచ్చట పడ

(8)

తాడు. ఆ మెచ్చటే ముక్తి రూపంలో మానవుడికి అనుభవానికి వస్తుంది. జీవన్ముక్తుడయిన మానవుడు ఈ సృష్టిని మరింత జీవవంతంగా మలచ గలుగుతాడు. అందుకు కావలసిన పిలుపును అందించడానికీ అందుకు కావల సిన మలుపును తిప్పి మానవ జాతిని నడిపించడానికీ పరబ్రహ్మమే మాస్టర్ సి. వి. వి. గా రూపు ధరించింది.

ఆ పిలుపు అందుతూనే ఉంది. జాతి ఆ మలపును తిరుగుతూనే ఉంది. నానావిధ కల్లోలాల మధ్యనుండి అతడుద్దేశించిన పరిపూర్ణత్వం వైపుకు ఈ సృష్టి పరుగులిడుతూనే ఉంది. మనమూ ఆ పరుగువైపుకు మొగ్గుదాం. ఆధారపడేస్థితినుండి ఆ దారిన పడేస్థితికి మళ్లుదాం.



# నవయుగ ప్రవక్త

స్వతంత్రం కోసం సమరం నడిపించిన కాలంలో జాతికోసం తమ సమస్తాన్నీ ఒడ్డి పోరాడిన పెద్దల సంఖ్య వేలమీద ఉంటుంది. స్వతంత్రం వచ్చిన తరువాత జాతికోసం తమ జీవితాలను ధారపోసిన పెద్దలను మనం వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. అలా వేళ్ళమీద లెక్కపెట్టగలిగిన మహనీయులలో మాస్టర్ ఇ. కె. ఒకరు.

రామకృష్ణ పరమహంసతో ప్రారంభమైన జాతి పునర్నిర్మాణ ఉద్యమం అలా అలా సాగివచ్చి అరవిందుని మీదుగా మాస్టర్ ఇ.కె.ను చేరుకున్నది. స్వతంత్రం వచ్చినతరువాత త్వరత్వరగా మారిపోయిన పరిస్థితులకు అనుగుణంగా జాతి పునర్నిర్మాణ ఉద్యమాన్ని మలచి నిర్వహించినవారు మాస్టర్ ఇ. కె.

ఎందరో మహానుభావులకు వెలుగుల నేపథ్యంగా పనిచేస్తూ వస్తున్న మాస్టరు సి. వి. వి. వీరిని తమ దివ్యమైన వాహికగా కోరి స్వీకరించారు. వీరిద్వారా జాతి పునర్నిర్మాణ ప్రణాళికకు ఒక సమగ్రరూపం వచ్చేటట్లుగా చూశారు. వారే వీరుగా వ్యక్తమయ్యారా అన్నంతగా తమ వైభవాన్ని వ్యక్తం చేశారు.

మహనీయులను విడివిడిగా చూడటమన్నది కలి లక్షణం. వారి మధ్యగల కలివిడితనాన్ని గమనించుకోగలగడ మన్నది కలిని దమించ

గలిగిన వారికి మాత్రమే సాధ్యమయ్యే అంశం. అలా చూడగలిగినప్పుడు సాగివస్తున్న జాతి పునర్నిర్మాణ ఉద్యమంలో ఈ మహనీయులందరూ మనకు మైలురాళ్ళుగా గోచరిస్తారు.

మాస్టర్ ఇ. కె. ఒక వ్యక్తికాదు. ఒకశక్తి. ఒక వ్యవస్థ. ఒక సంస్థ. తానే జగద్గురు పీఠమవేసంస్థగా రూపొంది ఈ జగత్తు మొత్తాన్నీ వెలుగులతో ముంచెత్తిన మహనీయుడాయన!

మనకు స్వాతంత్ర్యం వచ్చిన కొద్ది కాలానికే మహాత్ముడు ఈ భూమి మీద నుండి నిష్క్రమించాడు. మహాత్ముని అనుయాయులలో కొందరు పాలనా రంగంలో స్థిరపడగా, మరికొందరు ప్రజల సేవలో నిలిచి పోయారు. పాలనారంగంలోని వారికీ ప్రజలసేవలో ఉన్న వారికీ కావల సిన అనుసంధానం కనుక కుదిరి ఉంటే నవభారతం మరొకలా ఉండి ఉండేది. కాని అలా జరుగలేదు. తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం అన్నట్లుగా ఎవరికి వారే అయిపోయారు. దానితో పెద్దలపైనా, ప్రజలపైనా మహాత్ముని ప్రభావం క్రమంగా తగ్గుముఖం పట్టింది.

స్వాతంత్ర్యం కోసం పోరాడిన పెద్దలందరూ ఒకరొకరుగా కను మరుగు కాసాగారు. పోగా మిగిలినవారు ప్రేక్షకులుగా మిగిలిపోయారు. కొండ ఎక్కడానికి చాలాసేపు పడుతుంది. అదే కొండమీదనుండి పడ టానికి కొద్ది క్షణాలు చాలు. స్వాతంత్ర్యంకోసం పోరాడిన కాలంలో దశాబ్దాల తరబడి కృషిచేసి పెంచుకుంటూ వచ్చిన నైతిక విలువలనుండి జాతి అంత లోనే త్వరత్వరగా జారిపడిపోసాగింది.

స్వాతంత్ర్యం వచ్చింది అన్నమాటేగాని కుతంత్రం పెచ్చరిల్లింది. బాధ్యతా రాహిత్యం మితి మీరింది. స్వార్థపరత్వం విజృంభించింది. స్వాతంత్ర్యం రాకముందు తెల్లవాడు నల్లవాడిని పీడిస్తే, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత నల్లవాడు నల్లవాడినే పీడిస్తున్నాడు- అన్న పరిస్థితి ఏర్పడింది.

స్వాతంత్ర్యం రాకముందు దేశంకోసం వ్యక్తులు ఆహూతి కాగా స్వాతంత్ర్యం వచ్చిన తరువాత వ్యక్తులకోసం దేశం దగ్ధమవుతోంది. స్వాతంత్ర్యం రాకముందు వ్యక్తిగత సంపదలు దేశానికి సమర్పింపబడగా, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత దేశ సంపదలన్నీ వ్యక్తుల వెనుకకు చేరు కొంటున్నాయి.

'ఒకప్పుడు దేశం కోసం తన సమస్తాన్నీ ధారపోసిన జాతేనా ఇది, ఈనాడు దేశాన్ని ఇలా దొంగల దోపిడిగా దోచుకుతింటున్నది! అని పిస్తున్నది. ఒకప్పుడు ఇంటిని మరచి దేశం కోసం నిలచిన జాతేనా ఇదీ, ఈనాడు దేశాన్ని విడిచి ఇంటికి ఇలా అంకితమవుతున్నది!' అనిపిస్తు న్నది. ఎవరికి ఎవరూ పట్టని స్థితి. జాతీయత లోపించిన స్థితి. దేశభక్తీ, చిత్తశుద్ధీ కనిపించని స్థితి. ఏమిటి ఈ విషమ పరిస్థితి!

స్వాతంత్ర్యం కోసం పరితపించిన పెద్దలందరు కోరుకున్నది ఈ భారతాన్నేనా! దీనికోసమేనా వీరందరూ ఆహుతైంది! తలుచుకొంటే గుండె బరువెక్కుతుంది. బహుశా మనకు గుండె బరువెక్కినప్పుడే, భూమికి కూడా తన స్థితి తనకు భారమనిపిస్తుందేమో! భూభార నిర్వా పణ కోసం ఆమె చేతులెత్తి దేవదేవునికి నమస్కరిస్తుందేమో! అప్పుడు ఆయన తగిన రూపంలో కలుగజేసుకొంటాడేమో! అన్నట్లుగా ఇలాంటి పరిస్థితులలో మాస్టర్ ఇ.కె. జాతి పునర్నిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టి ఉద్యమశీలంతో ముందుకు సాగడం జరిగింది.

భారతదేశం పైన విదేశీ దండయాత్రలు, దురాక్రమణలు అనాదిగా జరుగుతున్నవే! ఆ దురాక్రమణల వల్ల మానజాతి ఎంతగా విచ్ఛిన్నమై పోతూ వచ్చిందో, మన సంస్కృతి ఎంతగా దెబ్బతింటూ వచ్చిందో మనం గమనించవచ్చు. అయితే ఆంగ్లేయుల వరకూ జరిగిన దురాక్రమణల తీరు వేరు. వారు మన సంస్కృతిని భౌతికంగా దెబ్బతీశారు. గుడి గోపురాలను

ధ్వంసం చేశారు. విగ్రహాలనూ, శిల్పాలనూ వికృత స్థితిలో నిలబెట్టారు. అది ఒక పద్ధతి. ఆంగ్లేయులు అలాకాక మన సంస్కృతిని మానసికంగా దెబ్బతీశారు. భారతీయ సంస్కృతినుండి భారతీయుణ్ణి శాశ్వతంగా వేరు చేయాలని ప్రయత్నం చేశారు.

వేదోపనిషత్తులను ప్రాకృతజనులు పాడిన పాటలు అన్నారు. పురాణేతి హాసాలు కల్పిత గాధలేమో నన్న శంకను కలిగించారు. గుడి గోపురాలు, అర్చన విశేషాలు-ఇవన్నీ ఈమధ్యన వచ్చినవేనన్నారు. భారతీయుడు తన సంస్కృతిని తానే అనుమానించేటట్లుగా, తానే అవమానించేటట్లుగా తమ పథకాన్ని నడిపించారు. భారతదేశంలోనే భారతీయతకు ఇక చోటుండదా! అన్న స్థితికి తీసుకువచ్చారు. ఈ పరిస్థితినంతా గమనించిన మాస్టర్ ఇ.కె. సనాతన ధర్మాన్ని నేటియుగానికి తగినవిధంగా శాస్త్రీయమైన పద్ధతిలో వివరించారు. తమ వివరణలతో ఆంగ్లేయులు సృష్టించి వదలిన అపోహలను పటాపంచలు చేశారు.

వేదసూక్తాలకు వ్యాఖ్యలు వ్రాశారు. పురాణేతిహాసాలకు భాష్యాలు అందించారు. ఆయా గ్రంథాలలో ఆధునిక మానవునికి అనుక్షణం కలుగుతున్న అనుమానాలన్నింటికీ శాస్త్రీయమైన వివరణను అందజేశారు. పవిత్ర గ్రంథాలెన్నింటినో ప్రతి మనిషీ చదువుకొనేటందుకు వీలుగా, సత్యమేమిటో తానే తెలుసుకునేటట్లుగా, దివ్యమయిన తన రచనా శక్తితో అపూర్వంగా మలచి అందించారు. ఈ రచనల వలన భారతీయులు దారిన పడటమే కాక, దేశదేశాల ప్రజలు భారతీయతకు చేతులెత్తి జోతలు అర్పించడం జరిగింది. జరుగుతున్నది.

ప్రపంచ ప్రజల జోతలను అందుకొంటూ, దేశదేశాల సంస్కృతులకు సమన్వయాన్ని సాధిస్తూ, ప్రాక్ పశ్చిమాలనడుమ సాంస్కృతికమయిన వారధిని నిర్మించారాయన. ప్రపంచమంతా పర్యటిస్తూ, సనాతన ధర్మాన్ని ప్రబోధిస్తూ 'ఇది విదేశ పర్యటన కాదు ఇది నేను చేస్తున్న భూ

ప్రదక్షిణం' అని ప్రేమతో చాటారాయన. 'వసుధైక కుటుంబం' అన్న ఋషుల ఆశయానికి రూపకల్పన చేశారాయన.

బాధ్యతారహితమైన ప్రవర్తన నుండి బయటపడమని జాతికి పిలుపు నిచ్చారు. బాధ్యతలను నిర్వర్తించిన వారికే హక్కులను అనుభవించే అర్హత ఉంటుందని నొక్కిచెప్పారు. సమాజం నాకేమి చేసింది అని అన వద్దు. సమాజానికి నేనేమి చేశాను అని ప్రశ్నించుకో, అని ప్రబోధించారు.

'నా కాళ్ళపై పడటం కాదు. ముందు నీ కాళ్ళమీద నీవు నిల బడాలి!' అని మృదువుగా మందలించారు. 'సమర్థులు కండి! స్వయంసమృ ద్ధిని సాధించండి! మీరే పదిమందికి పనిచూపగలవారు కండి!' అని యువ కులను ఆత్మీయంగా ఉత్సాహ పరిచారు.

'ఎవరో రావాలనీ, ఏదో చేయాలనీ ఎందుకనుకుంటారు మీరు. మీకు అనిపించింది మీరు చేయలేరా! చేయడం మొదలుపెట్టండి. శక్తి అదే వస్తుంది. చేస్తున్నకొద్దీ వస్తుంది!' అంటూ యువకులను వెన్ను తట్టారు.

'చేయగలిగినది చేసే స్థితినుండి చేయవలసినది చేసే స్థితికి నీవు ఎదిగిరావాలి! నీవు చేయవలసినది నీవు చేస్తుంటే నీకు కావలసినది నీ దగ్గ రికే నడచివస్తుంది. కర్తవ్య నిర్వహణలో ఉన్నవారికి కావలసినది అందక పోవడమంటూ ఉండదు.' అంటూ జాతిలో ఆత్మవిశ్వాసాన్ని మరొకసారి రగిలించారు.

'నీవు చేయనంత మాత్రాన ఈ భూమిమీద ఏపనీ ఆగదు. నీవు చేయకపోతే నీకన్నా మంచివాడు, నీకన్నా సమర్థుడు వచ్చి ఆ పనిని నీకన్నా చక్కగా చేస్తాడు.' అంటూ అలసులను ఆయన హెచ్చరించారు.

'పనిని పవిత్రంగా చూడు. బరువుగా చూడకు. సమస్యగా అను కోకు. మలినపరిచే ప్రయత్నం చేయకు. నీవు ఎదగడానికి, నీ జీవితానికి ఒక అర్థం, ఒక అనుభూతి లభించడానికి ఆ పని నీకు అప్పగించబడిందని,

అదే ఒక దివ్యమయిన అవకాశమని గ్రహించు! అని సకల జనులను ఉద్బో ధించారు.

జాతి పునర్నిర్మాణం కోసం ఏది అవసరమయితే అది అయ్యారా యన. ఆచార్యుడయ్యారు. వేలమందిని తీర్చిదిద్దారు. ఘనవైద్యులయ్యారు. లక్షలమందిని సేవించారు. మహాకవి అయ్యారు. కావ్య నాటకాదులను రమ్యాతిరమ్యంగా రూపొందించారు. రచయిత అయ్యారు. ఆధునిక రచనా ప్రక్రియలను అర్థవంతంగా నిర్వహించారు. భాష్యకారుడయ్యారు. ఆర్ష వాఙ్మయంలోని సృష్టి రహస్యాలను ప్రకాశింప జేశారు. శాస్త్రవేత్త అయ్యారు. జ్యోతిష శాస్త్రంనుండి మనస్తత్త్వశాస్త్రం వరకు ప్రధానమైన శాస్త్రాలన్నింటికీ పరిపూర్ణతను అందించారు. సంఘసంస్కర్త అయ్యారు. సమాజంలోని కుసంస్కారాలను, దుష్ట సంప్రదాయాలనూ పెకలించి వేశారు. - ఇలా ఒక టీమిటి ఏ క్షణానికి ఎలా అవసరమో, ఆ క్షణానికి అలా రూపొందారు. ఏ పాత్ర ఎక్కడ అవసరమో ఆ పాత్ర తానై అక్కడ నిలిచారు. రోజుకు ఇరవై రెండు గంటలు అవిశ్రాంతంగా కర్త వ్యాన్ని నిర్వహించారు. ఆ కొద్దిపాటి విశ్రాంతిని కూడా పనిచేయడానికి మరల అందే పెట్టుబడిగా స్వీకరించారు. అలాంటి మహనీయుని జన్మదినం ఈనాడు జన్మదిన సందర్భంగా వారి ఉద్బోధను విందుగా అందుకొందాం! వారి పునర్నిర్మాణ ఉద్యమానికి వారసులమవుదాం! జాతి పునర్నిర్మాణం అసాంతము జరిగేటంతవరకూ ఏ మాత్రము విశ్రాంతిని కోరము-' అని ప్రతిన చేద్దాం.

# శ్రీ అరవిందుని జన్మదినం ...

తన జీవితాన్నే తపస్సుగా నిలిపి తన జన్మదినాన్నే మనదేశానికి స్వాతంత్రదినంగా రూపొందించిన మహనీయుడు శ్రీ అరవిందుడు.

కనబడి ఎంతగా చేయవచ్చో, కనబడకుండానూ అంతగా చేయ వచ్చు, ఇంకా చెప్పాలీ అంటే అంతకంటే ఎక్కువగా చేయవచ్చు- అని తన సార్థకమైన జీవితం ద్వారా నిరూపించిన ఘనుడాయన. మన దేశ స్వాతంత్ర్యోద్యమంలో ఆయన కనబడి చేసింది ఎక్కువ. కనబడకుండా చేసిందే ఇంకా ఎక్కువ.

స్వాతంత్ర్యోద్యమంలో కనబడినప్పుడు ఆయన ఒక విప్లవవాది. ఆ ఉద్యమం నుండి భౌతికంగా నిష్క్రమించిన తరువాత ఆయన ఒక యోగీంద్రుడు. 'ఈ రెండు పాత్రలకూ ఎలా పొంతన కుదురుతుంది?' అని అనిపించవచ్చు. ఎందుకు కుదరదూ! సాహసికుడైన యువకుడు బాధ్యత ఎరిగిన తండ్రిగా రూపొంది మసలుకోవడం మనం చూడటంలేదా! ఆ యువకుడేనా ఈ తండ్రి!- అని మనం ముచ్చటగా ఆశ్చర్యానందాలను ప్రకటించవచ్చు. కాని ఇది ఎలా సాధ్యం! అని మాత్రం కొట్టివేయడంలేదు కదా! నిజం చెప్పాలీ అంటే యోగీంద్రునిగా కూడా అరవిందుడు సాధించ

తలపెట్టింది విప్లవాన్నే! భారతజాతికి సంపూర్ణమైన స్వేచ్ఛ కావాలని ఆయన విప్లవవాదిగా గర్జించాడు. నడుస్తున్న ఈ సృష్టి తన పరిణామంలో పరిపూర్ణతను పొంది దివ్యత్వంలోనికి అడుగిడాలని యోగీంద్రునిగా అపారమైన తన సంకల్ప శక్తితో కాంక్షించాడు. సాధించాడు.

బాల్యంలోనే అరవిందుడు భారతదేశానికి అవలగల పాశ్చాత్య సీమలకు పంపబడ్డాడు. అతని విద్యాభ్యాసమంతా అక్కడే జరిగింది. ఆ విద్యాభ్యాసం జరుగుతూ ఉండగానే మాతృదేశంమీద భక్తి, మాతృదేశ సంస్కృతిపైన ఆరాధనాభావం అతనిలో పెల్లుబికాయి.

భారతదేశం రాగానే స్వాతంత్ర్యోద్యమంలో దూకాడు. అంతవరకూ అంతంతమాత్రంగా నడుస్తున్న స్వాతంత్ర్యోద్యమం అరవిందుని ప్రవేశంతో వేగాన్ని పుంజుకొంది. కొద్దిపాటి సౌకర్యాలతో సరిపెట్టుకొందామనుకొన్న బ్రిటీషవారితో ఎలాగో ఒకలా సర్దుకొని పోదామనుకొంటున్న స్వాతంత్ర్యోద్యమ నాయకులకు దేశవ్యాప్తంగా అరవిందుడు తీసికొని వచ్చిన చైతన్యంతో శ్రుతి కలపక తప్పలేదు. 'ఇప్పుడు దేశానికి కావలసినది సర్దుబాటు కాదు. స్వాతంత్ర్యము - సంపూర్ణస్వాతంత్ర్యము-' అన్న అరవిందుని మాటతో వారూ శ్రుతికలిపి గొంతెత్తి నినదించక తప్పలేదు.

దేశంలోని వాతావరణం ఇలా వేడెక్కిన సమయంలో ఒకానొక కేసులో నిందితుడుగా బంధింపబడి ఆలీపూర్ జైలులో ఉంచబడ్డాడు అరవిందుడు. అప్పటికే అతడు యోగసాధనలో ఉన్నాడు. ఆ సాధనమూ, శక్తులనూ తన సమస్తాన్నీ దేశమాత విమోచనానికే ధారపోస్తున్న వాడతడు. అలాంటి అరవిందుడు జైలులో కూడా తన సాధనను కొనసాగిస్తూ 'ఇప్పుడు నేను ఇక్కడ ఎందుకు ఉంచబడ్డాను ?' అని అనుకొన్నాడు. అలా అనుకొంటూ ఉండగానే అప్పుడే అక్కడే ఆ జైలులోనే అతడికి శ్రీకృష్ణుని సాక్షాత్కారమైంది. కృష్ణదేవుడు తన దర్శనాన్ని

అనుగ్రహించి, అతడిని సేదతీర్చి ఇలా అన్నాడు: ఈ దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం రావాలన్నది 'నా' సంకల్పమే! స్వాతంత్ర్యం తప్పక వస్తుంది. ఈ భారతదేశం స్వాతంత్ర్యమై ప్రపంచ దేశాలకు నా 'వాణి'ని వినిపించవలసివుంది. ఇది నా నిర్ణయం.

క్రమంగా అరవిందుడికి కర్తవ్యం బోధపడసాగింది. స్వాతంత్ర్యోద్యమం వేగాన్ని పుంజుకొంది. సంపూర్ణ స్వాతంత్ర్యం ఇక సిద్ధించనుంది. అయితే దేవ దేవుని వాణిని దేశదేశాల ప్రజలకు వినిపించేలాగున ఈ భూమినీ, ఈ ప్రజలనూ సంసిద్ధం చేయవలసివుంది. అందుకుగాను మనం నడుం కట్టవలసివుంది. అన్న నిర్ణయానికి వచ్చాడతను. అటుపైన క్రమంగా పాండిచేరి చేరుకున్నాడు.

విప్లవవాది అయిన అరవిందుడు, అరవింద యోగీంద్రుడుగా రూపొందాడు. ఫ్రాన్స్ దేశం నుండి వచ్చి తన చెంత స్థిరపడిన 'శ్రీమాత'తో శ్రుతి కలిపి దివ్యమైన తన ప్రయాణాన్ని కొనసాగించాడు. శ్రీమాత చేరికతో అతడి రెండవ జీవితం వ్యక్తం కావడం మొదలైంది. శ్రీకృష్ణుడు తన కార్యక్రమానికి ఇలా రూపుదిద్దినట్లైంది.

అరవిందుడు వివిధ దేశాల తాత్త్విక నేపథ్యాలను సమీక్షించాడు. సనాతన ధర్మాన్ని సమన్వయించి ప్రపంచ జాతిని దివ్య జీవన మార్గం వైపుకు మళ్ళించాడు.

వివిధ దేశాల సంస్కృతీ, సాహిత్యాలను పరిశోధనలో పరిశీలించాడు. ఆ యా సాహిత్యాలలోని లోతుపాతులను కావలసిన క్రమంలో అమర్చి చూపించాడు.

ఇప్పుడు ఒక పని చేశాడు. అతడు తత్త్వవేత్త. అతడు సాహితీ వేత్తకూడ అయినాడు. దివ్యమూ, ప్రౌఢమూ అయిన కవిత్వాన్ని గానం చేయనారంభించాడు. అతడు రచించిన 'సావిత్రి' ఆధునిక యుగంలో దిగివచ్చిన వేద కావ్యమని చెప్పవచ్చు. వేద ఋషులు సంస్కృతాన్ని

తమ వాహికగా ఎలా వినియోగించుకొన్నారో, అరవిందుడు ఆంగ్లాన్ని అలా తన వాహికగా వినియోగించుకొని దివ్యమైన వేదాన్ని ప్రకాశింప జేశాడు. ఆర్ష వాఙ్మయంలో బీజరూపంలో ఉన్న దర్శనాన్ని ఒక కల్ప వృక్షంగా సావిత్రిలో మనకు అనుగ్రహించాడు.

ఒక వైపు దివ్యమైన జీవితానికి బాటలు వేస్తూనే మరొకవైపు భారతదేశ స్వాతంత్ర్యోద్యమానికీ, ప్రపంచ జాతులను కలిపి నడపడానికీ అరవిందుడు తన తపశ్శక్తిని వినియోగిస్తూ వచ్చాడు. ఇంటి యజమాని ఇంటికి ఇవ్వాల్టికి కావలసినవి చేస్తూనే, భవిష్యత్తుకు ఇంకొంత భద్రంచేస్తూ ఉంటాడు కదా! అలాగే అరవిందుడు తన తపస్సుతో ఇప్పటి అవసరాలను తీరుస్తూనే మానవజాతికి ఎప్పటికీ అవసరమైన దివ్య జీవన మార్గాన్ని స్పష్టం చేశాడు. 'తపస్సంటే ఇది. ఇలా చేయాలి. ఇందుకు చేయాలి. తపస్సును ఇలా సద్వినియోగం చేయాలి!' అన్న సత్యాన్ని అతడు తన యోగ జీవితంద్వారా మరొకసారి చాటాడు.

ఈనాడు శ్రీ అరవిందుని జన్మదినం. ఈ జన్మదినం నాడు అతడు చేసిన తపస్సును మనసారా స్మరించుకొందాం! స్మరించుకొంటూనే మనమూ ఆ తపస్సులోనికి అడుగిడుదాం! ఇహపరాలను సాధిద్దాం! విందుగా సాధిద్దాం!



# రావాలని.... వస్తాడని

భూమి అతడు రావాలని కోరింది. ఆకాశం అతడు వస్తాడని చెప్పింది. అందరూ అతడి రాకకు ఎదురు చూశారు. ఇష్టపడుతూ కొందరు వెష్టపడుతూ కొందరు- అనురాగంతో కొందరు- అదిరిపడుతూ కొందరు- ఉల్లాసంతో కొందరు, ఉలికిపడుతూ కొందరు- ఇలా మొత్తం మీద అందరూ అతని రాకకు అదేపనిగ ఎదురు చూశారు.

అంతలోనే అతడు అగుపించాడు. దేవదేవుడయిన అతడు దేవకీ దేవికి తనయుడయ్యాడు. ఆకాశ పురుషుడయిన అతడు ఆ అమ్మకు బిడ్డగా రూపొంది, ఆమెను అలరించాడు. క్షీరసాగరాన శయనించే అతడు ఆ మాతృమూర్తి అందించే క్షీరం కోసం తహ తహ లాడుతున్నాడు. తడుములాడుతున్నాడు. అతడు తడుముతున్నాడు. ఆమె తన్మయ మవుతున్నది. అతడు త్రాగుతున్నాడు. ఆమె తరిస్తున్నది. అతడు తృప్తి చెంది చూస్తున్నాడు. ఆమె ముక్తిపొంది మురుస్తున్నది.

తల్లి చేతులనుండి తండ్రి శిరస్సున చేరాడతడు. తండ్రి బిడ్డను శిరసావహిస్తున్నాడు. కలకాలం లోకులంతా తమ బిడ్డను ఇలాగే శిరసావహించాలి అన్నట్లుగా !

కారాగారం కనులు నులుముకొని చూచింది. తన తలుపు తెరిచి ఆ తండ్రీ కొడుకులను సాగనంపింది.

పరివారం నిద్రపోతున్నది 'స్వామి వచ్చాడు. ఇక లోకమంతా గుండెమీద చేయివేసికొని ఇలా ఆదమరచి నిద్రపోవచ్చునన్నట్లుగా !

వసుదేవుని నడక సాగుతోంది. దేవదేవుడు పైనుండి నడుపు తున్నాడు. శిరస్సు పైనుండి నడుపుతున్నాడు. చీకటిలో కూడా దారి కన పడుతోంది. ఆకసాన చుక్కలన్నీ సొక్కుతూ చూస్తున్నాయి.

చీకటి నల్లన, యమున నల్లన, శిరస్సున ఉన్న శిశువు నల్లన, ఆ నల్లని వానిచుట్టూ ఉన్నవన్నీ నల్లన.

స్వామిని చూసి యమున పరవశించింది. ప్రక్కలకు మళ్ళి దారి నిచ్చింది. అప్పటికప్పుడు ఏర్పడుతున్న ఆ దారివెంట సాగుతున్నాడు వసుదేవుడు.

ఇంతలోనే మబ్బు, అంతలోనే వర్షం. ఆ వర్షం ఈ సృష్టికి కలిగిన హర్షం. ఆ జల్లులు శిశువుపైన పడకుండా తన పడగలను గొడుగుగాపట్టి తోకపైన తాను నిలచి అలా ఆ వెంట సాగివస్తున్నాడు ఆదిశేషుడు. పడగ లను ఇచ్చుట కూడ నీవెంట పడగలను అన్నట్లుగా!

ఆయన ఎక్కడవున్నా ఆయనకు సంబంధించిన వారంతా ఆయన తోనే ఉంటారు—అన్నట్లు ఉంది ఆ దృశ్యం. అవును, ఎవరి వారిని ఎవరు విడిచి పెట్టుకుంటారు.

ఇంకా చీకటిగానే ఉంది. తెల్లవారుతున్న సూచనలు మాత్రం కనబడుతున్నాయి. వ్రేపల్లెలో ఒక్కరొక్కరే నిద్ర మేల్కొంటున్నారు. యశోదమ్మ ప్రక్కన నిలిచాడు వసుదేవుడు.

అక్కడొక చిన్న పాప ఉంది. అప్పుడే చేసిన బాబు ఆ పాప వంక చూశాడు. పాప నవ్వింది, బాబు నవ్వాడు. యశోదమ్మ నవ్వింది, వసుదేవుడు నవ్వాడు. ఇకపైన లోకమంతా ఇలాగే ఆనందంగా నవ్వు తారు-అన్నట్లుగా నవ్వుతున్నారు వాళ్ళు.

బాబు యశోదను చేరాడు. పాప వసుదేవుని చేరింది. మరొకంటికి తెలియకుండా మారిపోయారు వారిద్దరూ! భూమిపైన పరిస్థితులన్నీ తగిన విధంగా మారాలీ అంటే ఈ విధమైన మార్పు తప్పదు-అన్నట్లుగా !

వసుదేవుడు కదలలేక కదిలాడు. యశోదమ్మ పంపలేక పంపింది. ఈ మన జీవితాలు స్వామి ప్రకారం సాగిపోవాలి, అని అనుకొంటూనే ఆ ఇద్దరూ కర్తవ్యం వెంటసాగారు.

పాప కంసుణ్ణి చేరి నవ్వింది. కంసుడు తెలిసీ తెలియని స్థితిలో పడిపోయాడు. పాప పైకి ఎగిరింది, కంసుడు గుండె బిగపట్టుకున్నాడు. 'ఇక కథ మొదలవుతున్నది!' అన్నది పాప. మొదలంట నరకబడిన చెట్టులా కూలబడ్డాడు కంసుడు.

ఇంతకూ అతడేడి ? అష్టమ గర్భాన పుట్టిన అతడేడి ? అన్వేషణ ప్రారంభించాడతడు. రాత్రింబవళ్ళు అదే ఆలోచన, అదే ఆలాపన, అదే ఆలంబన. ఇదేమి ఆరాధన ! అతడు కాగిపోతున్నాడు. ఆలోచనలో వేగిపోతున్నాడు. ఆగలేకపోతున్నాడు.

రాక్షసులను ఒక వర్గంగా రూపొందించి ఒక్కొక్కరినీ వ్రేపల్లెకు పంపసాగాడు. అలా వ్రేపల్లెకు వెళ్ళేవారేగాని తిరిగివచ్చి అతడికి కబురు అందించేవారు ఎవరూ లేకపోయారు. అతనికి ఆశ్చర్యం వేసింది. రాక్షసులందరు హతులవుతున్నారు. ఆ పాపడు మాత్రం చెక్కు చెదరడం లేదు. ఏమిటీ వైష్ణవ మాయ.

ఇలా ఆ బాలుడు గోపాలుడై అక్కడ నుండే భూభార నిర్వాపణ కార్యక్రమం ప్రారంభించాడు. అప్పటినుండే భూమి మీద ధర్మ సంస్థాపన చేసేయ సాగాడు.

దుష్టులను అతడేమీ అనలేదు. వారే కోరివచ్చి, అతని దృష్టిలో పడసాగారు. పనిపేరా అతనితో వైరం పెట్టుకొని అతడి చేత చంపబడ

సాగారు. ఒక కంసుడు గాని, ఒక జరాసంధుడు గాని, ఒక శిశుపాలుడు గాని, ఒక కాలయవనుడు గాని - ఇలా దుష్టులెవరయినా సరే వారుగా అతడితో కలబడి తాముగా అసువులను బాసిన వారే!

దుష్టులు అతని జీవితం లోనికి వారుగా ప్రవేశిస్తే శిష్టుల జీవితాల లోనికి స్వామి తానుగా ప్రవేశించాడు. శిక్షింపబడవలసిన వారు తనను వచ్చి చేరుతూ ఉండగా, రక్షింపబడవలసిన వారి చెంతకు తానుగా వెళ్ళి తలుపుతట్టాడు స్వామి.

పాండవులను తానే కలుసుకొన్నాడు. వారి కష్ట సుఖాలు తనవిగా చేసుకొన్నాడు. వారిని కంటికి రెప్పలా కాచుకున్నాడు. పిలచినంత మాత్రాన ద్రౌపదికి వలువలందించాడు. భారం నీది అన్నంత మాత్రాన రాయబారిగా వెళ్ళి రంగులు తేల్చాడు. సారథివి నీవు అన్నంత మాత్రాన రథాన్ని తోలాడు. గుఱ్ఱాలను తోమాడు. పడిపోతున్నాను అనగానే అర్జునుణ్ని ఒడుపుగా పట్టుకొన్నాడు. శరీరాన్ని విడిచి పెడదాము అని అనుకొంటూ ఉండగానే భీష్ముని చెంత తానుగా నిలిచాడు. ఇలా నమ్మిన బంటులా తనను నమ్మిన వారిని వెన్నంటి నిలిచాడు.

ఇతడు వెన్నల దొంగ, వేణుగాన లోలుడు. వెన్నంటి నిలిచే ఆర్తత్రాణ పరాయణుడు.- అంటూ అనుకొంటూ మురిసిపోయారు వారందరూ.

దుష్టులు అతని వెంట తిరుగుతారు. శిష్టుల వెంట అతడు తిరుగుతాడు. ఇలా వారూ వీరూ అతనితో అల్లి బిల్లి తిరుగుతూ ఉండగానే కథ కంచికి చేరుకుంది. మంచికి విజయం లభించింది. మీరూ మంచిగా

ఉండండి. మీకూ విజయం లభించేటట్లుగా నేను చేస్తాను- అన్నట్లుగా చూస్తూ నిలబడ్డాడతను రానున్న తరాల వైపుకు.

బాగుంది, దుష్టులు వెళ్ళిపోయారు. పని పూర్తయి శిష్టులూ వెళ్ళిపోతున్నారు. పని అయిపోయింది కదా అని నీవూ వెళ్ళవస్తానంటున్నావు. మరి నా మాటేమిటి ? అన్నది భూమి.

అందుకు బదులుగా ఒక పసివాడినందించాడతను. అతడే పరీక్షిత్తు. కాలం పెట్టబోయే పరీక్షకు తట్టుకోగలిగిన వాడితడే ! నా ప్రేమ మార్గాన్ని ఈ భూమి పైన వ్యాపింపజేయగలిగిన వాడు కూడ ఇతడే!- అన్నట్లుగా చూశాడు స్వామి.

అవునా ! అన్నది భూమి. అంటూనే పరవశించింది.

అసలతడంటేనే ఒక పరవశం ! అదేమిటో మరి !



# నాటి నుండి నేటి వరకు

సంజయుడు కర్ణుడు — ఇద్దరూ కూడ సూతపుత్రులుగా పిలువబడిన వారే! సంజయుడు నిజంగా సూత పుత్రుడు. కర్ణుడు సూత పుత్రుడుగా అనుకోబడిన వాడు.

చిత్రమేమిటంటే ఇద్దరినీ సూతపుత్రులనే పిలిచినా సంజయుణ్ని అందరూ గౌరవించారు. కర్ణుడు మాత్రం అనేక సందర్భాల్లో సూత పుత్రుడని నిందింపబడ్డాడు. సూత పుత్రుడయినంత మాత్రాన నిందార్హుడయితే సంజయుడు కూడా నిందింపబడాలి కదా !

సంజయుడు ధృతరాష్ట్రుణ్ని సేవకుడై సేవించాడు. మిత్రుడై హితం చెప్పాడు. గురువై వాసుదేవ తత్త్వాన్ని ఉపదేశించాడు. ధృతరాష్ట్రుని చేత అన్నిస్థాయిలలోనూ చూడబడ్డాడు. అతడికి ఎప్పుడు ఎలా అవసరమో అప్పుడు అలా మెలగగలిగాడు. ధృతరాష్ట్రుణ్ణే మెప్పించాడూ అంటే ఇక ఇతరులను మెప్పించాడు అని వేరే చెప్పాలా! అర్జునుడు ఇతన్ని ప్రక్కన కూర్చోపెట్టుకున్నాడు. వ్యాసుడు ఇతణ్ని శిష్యశ్రేష్ఠునిగా పరిగణించాడు. శ్రీ కృష్ణుడు ఇతణ్ణి పరమార్థమెరిగిన జ్ఞానిగా ప్రశంసించాడు. శ్రీ కృష్ణుని నుండి వెలువడిన భగవద్గీత ఇతడి మీదుగానే లోకానికందింది. ఎలాంటి స్థితిని అనుభవించాడితను! ఎలాంటి స్థితిలో ఉంచబడ్డాడితను! ఎలాంటి స్థితిలో గురువుల చేత చూడబడ్డాడితను!

మరి కర్ణుణ్ణి కనబడ్డ వాళ్ళెల్లా నిందించారు. పెద్దలందరూ అతణ్ని తప్పు పట్టారు. భీమార్జునులు గేలిచేశారు. కర్ణుడి వల్లనే ఈ కథంతా జరిగిందన్నారు అందరూ! దుష్టచతుష్టయంలో ప్రముఖుడిగా పేరుపడ్డాడు. రాయబార అనంతరం శ్రీకృష్ణుని రథం ఎక్కేవరకూ రాగద్వేషాలే ఇతణ్ని నడిపించాయి-అన్నది మనకు స్పష్టమవుతుంది.

సంజయుణ్ణి గౌరవించిన వారు కర్ణుణ్ణి ఎందుకు గౌరవించలేదు! కులం అడ్డువస్తే ఇద్దరికీ అడ్డురావాలి కదా! సూటిగా చూడగలిగితే ఇక్కడ అడ్డు వచ్చింది కులంగాదు గుణం. గుణవంతుడు కాబట్టి సంజయుడు గౌరవింపబడ్డాడు. గుణహీనుడుగా ప్రవర్తించాడు కాబట్టి కర్ణుడు నిందించబడ్డాడు. సమాజం గుణం కనబడిన చోట కులాన్ని అడగదు. గుణం కనబడని చోట మాత్రమే అది కుల ప్రసక్తిని తెస్తూ ఉన్నది - అని వీరిద్దరి జీవితాలూ స్పష్టం చేస్తున్నాయి.

అప్పుడే కాదు, ఇప్పుడు కూడా! గుణవంతులయినవారు కనబడినప్పుడు మీ కులం ఏమిటని సమాజం ప్రశ్నించడంలేదు. ఒకవేళ వారి కులాన్ని గురించి తెలిసినా దానికి ప్రాధాన్యం ఇవ్వడం లేదు. ముమ్మడివరం బాలయోగి జీవితమే ఇందుకు ఒక ఆధునికమైన నిదర్శనం. తపస్సంపన్నుడయిన అతని కులాన్ని గురించి ఎవరైనా పట్టించుకొన్నారా! శివరాత్రి నాడు శివునితో సమానంగా అతడినీ అర్చిస్తూ వచ్చారు కదా!

గుణ సంపత్తి లేనప్పుడు గుణహీనత కనబడుతున్నప్పుడు సమాజం అతడి పుట్టుపూర్వోత్తరాలను తడుముతున్నది, అడుగుతున్నది. గుణహీనుడు కాకపోయినా, గుణ సంపత్తి ప్రజ్వరిల్లినా సమాజం ఇక పుట్టుపూర్వోత్తరాలను విస్మరిస్తున్నది. అవన్నీ అప్రధానమైన అంశాలు అంటున్నది. ఆనాటి నుండి ఈనాటి వరకు సమాజం మొత్తం మీద కని

పిస్తూ వస్తున్న ఈ మాత్రపు మంచితనాన్ని మనం గుర్తించాలి! అభినందించాలి!

కుల ప్రసక్తి తెస్తున్న వారిని నేను సమర్థించడంలేదు. అలా తేవడం భావ్యమని నేను అనడం లేదు. అయితే ఈ విషయమై సమాజంలో వ్యక్తమవుతూ వస్తున్న ఒకానొక సూక్ష్మాంశాన్ని నేను గమనించమంటున్నాను. గుణసంపత్తి పెంచుకోవడానికి సర్వదా ప్రయత్నించమని సర్వులకూ విజ్ఞప్తి చేస్తున్నాను. గుణసంపత్తి పెరిగిన కొద్దీ సామాజికమయిన రుగ్మతలు-అవి ఏవయినా సరే రూపుమాసిపోతాయని నేను నొక్కిచెబుతున్నాను. మహాభారతం ఈ విషయమై మనకు ఉపదేశిస్తున్న ధర్మసూక్ష్మాన్ని మీముందు పెడుతున్నాను. తోటి వారిని హీనంగా చూస్తున్నవారు వారిలో గుణసంపత్తి పెరిగిననాడు ఇంక అలా చూడలేరు. హీనంగా చూడబడుతున్నవారు వారిలో గుణసంపత్తి పెరిగిననాడు ఇంక అలా చూడబడరు.

మహాభారతం మనకు ఉపదేశిస్తున్న అసంఖ్యాకమైన ఉపదేశాలలో ఇది ఒకటి. నేటి సమాజానికి ఎంతగానో అవసరమైన ఉపదేశమిది!

పెద్దలు మహాభారతం పరమార్థాన్ని గురించి నన్ను వ్రాయమని అడిగారు. వైద్యుడు తన దగ్గరనున్న ఔషధాలలో రోగికి ఏది అవసరమో దానిని ఇవతలకు తీసి అందించినట్లుగా పారమందని మహాభారత మహేతిహాసం నుండి ఈ కాలానికి కావలసిన అంశాన్ని ఒకదానిని తీసి మీముందు ఉంచుతున్నాను. నేటి సమాజానికి కావలసిన ఔషధసేవగా నేను దీనిని విశ్వసిస్తున్నాను. మహాభారతమనే వినీల ఆకాశంలో ఈ మహత్తర సందేశం ఒకానొక మెరుపుతీగ మాత్రమేనని హితుడనై తెలియజెబుతున్నాను.

ధర్మార్థ కామమోక్షాల విషయంలో ఇందులో ఉన్నది ఎక్కడయినా ఉన్నది. ఇందులో లేనిది మరెక్కడా లేదు! అని అంటున్నాడు

మహాభారతగాథను జనమే జయునకు వినిపిస్తూ వైశంపాయనుడు. ఈ మాట ఎంత నిజం !

ధర్మార్థ కామమోక్షాల విషయంలో వేదశాస్త్ర పురాణ ఇతిహాసాల మధ్య అభిప్రాయభేదాలు ఏమయినా తలెత్తినట్లయితే, ఆయా సందర్భాలకు కావలసిన సమన్వయం మహాభారతం అలవోకగానూ, అర్థవంతంగానూ అందిస్తుంది! అని అంటున్నాడు భారతాను వాదంలో తనవంతు పాత్రకు శ్రీకారం చుడుతూ తిక్కన మహాకవి! ఈ మాట ఎంత మూదల !

మనవారు ఏది చెప్పినా అవన్నీ వేదాలలో ఉన్నాయని అంటారు. మరికొందరు అలా అనడాన్ని హేళన చేస్తూ ఉంటారు. అది అలా వుంచి, సామాజిక సహజీవనానికి కావలసిన సదుపదేశాలన్నీ, కావలసిన సమన్వయాలన్నీ మహాభారత మహేతిహాసంలో మహోన్నతంగా అందించబడ్డాయని అంగీకరించక తప్పదు. లోకశ్రేయస్సును కోరిన వారు దీనిని అనుసరించకా తప్పదు. 

# "ఆస్తిక భూమికి వారసులం"

కొన్ని పనులు మనవి కొన్నిపనులు దేవునివి ఉన్నాయనుకోవడం పద్ధతి కాదు. ఉన్న పనులన్నీ దేవునివే! ఈ జీవితమే దేవుడు మన కప్ప గించినపని. జీవితంలోని ప్రతిక్షణమూ,ప్రతిసన్నివేశమూ ఆయన ప్రకారం ఆయన కొరకు జరగవలసినవే! ఈ సృష్టి దేవుని సామ్రాజ్యం. సృష్టి లోని మన మందరం దేవుని రాజ్యంలోని కార్యకర్తలం. నిమిత్తమాత్రులం అన్నది పెద్దల మాట. అయితే కార్యకర్తలమన్నది ఇప్పటి మాట. మన కర్తమయ్యే మాట.

ప్రార్థన, అర్చన యజ్ఞయాగాదులు దేవుడి పనులుగానూ, నిత్య జీవితంలోని గృహకృత్యాదులనుమానవులపనులుగానూ భావించేవారున్నారు. ప్రార్థన, అర్చన, యజ్ఞయాగాదులు దేవుని పనులు కావు.జీవితంలోని పను లన్నింటినీ దేవుని పనులుగా మనం నిర్వహించేటందుకు కావలసిన శిక్షణను అనుభూతి ప్రదంగా అందించేటందుకు రూపొందినవే ప్రార్థన, అర్చన. యజ్ఞయాగాదులు. వీటిని దేవుని కొరకు చేస్తున్నామని అనుకో కూడదు. దేవుని ప్రకారం జీవించడం మనకు అలవాటయ్యేటందుకొరకు చేస్తున్నామని మనకు తెలియాలి. అలా తెలిసినప్పుడు ఆ ప్రార్థనాదులన్నీ సార్థకమవుతాయి. సద్వినియోగమవుతాయి. మన కొరకని కాక, దేవుని కొరకని చేస్తున్నామని అనుకొన్నప్పుడు అవి నామమాత్రమవుతాయి. తతంగాలుగా రూపొందుతున్నాయి. ఉత్సవాలుగా, ముచ్చటలుగా మిగిలి పోతున్నాయి.

కొందరు, మనపనులు అనే వాటివలనవచ్చిన సంపాదనలో కొంత దేవుని పనులు అనే వాటిపైన వెచ్చించి తృప్తిపడుతున్నారు. దేవుడి పనులు అనే వాటి వలన మన మనస్సులు శిక్షణ పొంది, మొత్తము పనులన్నింటినీ దేవుని పనులుగా చూడగలిగిన మేలుకొలుపు మనకు కలిగినప్పుడే ఆ పెడు తున్న ఖర్చునకు సార్థకత! అలా కానప్పుడు కేవలం అవి కాలక్షేపాలు అవుతాయి. దేవుడి పేరిట మనం తీర్చుకొనే సరదాలు అవుతాయి.

కొందరు సమాజహిత కార్యాలను సేవాకార్యాలుగా దేవుని కార్యాలుగా భావిస్తున్నారు. దాని కొరకు శారీరకంగా, మానసికంగా ఆర్థికంగా కృషి చేయడాన్ని దేవుని పూజగా వారు భావిస్తున్నారు. సమాజంలో దేవుని చూస్తూ ఇలాంటి కృషి చేసిన నాడు అది దేవుని పూజే అవుతుంది. అలా కాక పేరు ప్రతిష్ఠలకోసమో, హోదాలూ పదవుల కోసమో ఇలాంటి కృషి చేసినప్పుడు అది స్వార్థపరత్వమే అవుతున్నది.

పూజాదికాలు దేవుని కొరకు అన్నప్పుడు అవి ఫలించడం లేదు. పూజాదికాలు మనం శిక్షణ పొందేటందుకొరకు అని గ్రహించినప్పుడు అర్థవంతమవుతున్నాయి. సమాజకార్యాలు పేరు ప్రతిష్ఠల కొరకు అన్నప్పుడు అవి అహంకారాన్ని కలిగిస్తున్నాయి, రగిలిస్తున్నాయి. సమాజ కార్యాలు సమాజరూపంలో ఉన్న దేవుని కొరకు అన్న దర్శనం కలిగినప్పుడు అవి ఆత్మ దర్శనాన్ని అనుగ్రహిస్తున్నాయి. మనలను ఆత్మవంతులుగా తీర్చి దిద్దుతున్నాయి.

ఈ విశ్లేషణ మనలో జరిగినప్పుడు, ఈ పరిశీలన మనలో జరుగు తున్నప్పుడు మనం ఈ భూమికి అనగా ఈ 'ఆస్తిక భూమికి' తగిన వారసుల మవుతాం.



# నేడు కూడ నిలబడగలం

'ఇప్పటి ఈ సమాజంలో ఇలాంటి ఈ పరిస్థితులలో నైతిక విలువలను పాటించడం, వాటిని పోషించడం వాటికి కట్టుబడి జీవించడం సాధ్యమా!' అన్నది సహృదయుడయిన నేటి సగటు మనిషినుండి ఆర్తితో వెలువడుతున్న ప్రశ్న. అయితే మీరు దృఢంగా సంకల్పించినప్పుడు అలా జీవించడం సాధ్యమే! నన్నది మహాభారతమిస్తున్న సమాధానం.

కౌరవులు ధర్మాన్ని ప్రక్కనపెట్టి,ఇంకా చెప్పాలీ అంటే ప్రక్కకు నెట్టి అర్థకామాలకు పెద్దపీట వేశారు. నైతిక విలువలను తొలగద్రోసి తోచిన విధంగా బ్రతకడంలో వెర్రిపోకడలు పోయారు. తాము పోవడమే కాదు. అలా తమతోబాటు పడిపోయే వారిని నాటి సమాజంనుండి పెద్ద ఎత్తున సమీకరించుకొన్నారు.

కురుక్షేత్ర మహాసంగ్రామంలో ఎక్కువమంది రాజులు ఎవరి వైపున ఉన్నారు? కౌరవుల వైపుననే కదా! సంఖ్యాబలంలో ఎవరుముందున్నారు? కౌరవులే కదా! రాజ్యాధికారం ఎవరిచేత లాగుకోబడింది? కౌరవుల చేతనే కదా!

మరి పాండవులకు మిగిలిందేమిటి? దైవమూ, ధర్మమూ,కొద్దిమంది సహృదయులూ! మరి నాటి సమాజంలో నైతిక విలువలకు ఏపాటి చోటున్నది!

కనుక మనం బెంగపడ నక్కరలేదు. ధర్మజునిలా దృఢంగా నిలబడి ధర్మమూ, దైవమూ తోడురాగా అయాచితంగా లభించిన కొద్దిపాటి వనరులతో మనము తప్పకుండా విజయాన్ని సాధించగలము. తృప్తికరంగా సాధించగలము. ధర్మము నిలబడులాగున దైవము ముచ్చటపడులాగున సాధించగలము.

ధర్మాన్ని కోరి తనకాళ్ళపై తాను నిలబడి ఏమాత్రము చలించక ముందుకు సాగిన ధర్మజుడు మన కాదర్శం. భీముడు, ద్రౌపదీ మొదలయిన వారు కూడా తాత్కాలికంగా పరిస్థితుల ప్రభావానికి లోనై ఎదుటివారు వక్రమార్గాన్ని పట్టినప్పుడు మనమెందుకు పట్టరాదు అని అడిగినవేళ ధర్మజుడు చిరునవ్వు నవ్వుతాడు.-'అది పద్ధతి కాదు' అన్నట్లుగా!

మనని ఎవరూ విలువలకు కట్టుబడమని అనలేదు. మనమే కట్టుబడదాం అని అనుకున్నాం. కనుక కట్టుబడదాం! అన్న భావం అతని చిరునవ్వులో తొణికిసలాడుతుంది.

ఆ చిరునవ్వు వ్యాస కృష్ణులను ఆకర్షించింది. వారి చేయూతను అనుగ్రహంగా పొందింది. నానావిధ కల్లోలాలనుండి కథను కందకుండా మరొకరికి అందకుండా ముందుకు నడిపింది.

మనమూ అలాంటి చిరునవ్వు నవ్వుదాం. మనమూ అలాంటి వాతావరణాన్ని రూపొందించుకొందాం. మనమూ అంతటి అనుగ్రహానికి నోచుకొందాం. మనమూ అంతటి విజయాన్ని అలవోకగా అందుకొందాం.

దేశకాలాలకు అతీతమైంది ఈ సందేశం. తలచుకొంటే అలా నేడు కూడ నిలబడగలం! శాశ్వతమైన ఆ సందేశాన్ని మనసుండి, మన జీవితాల నుండి, మన జీవిత సన్నివేశాలనుండి అణువణువున వినిపించగలం. అడుగడుగున అందించగలం. దశదిశలకు వ్యాపించగలం. సత్య యుగాన్ని స్థాపించగలం. నేడు కూడ నిలబడగలం!

★

చదవండి చదివించండి చదివి వినిపించండి

మానవజాతిని కర్తవ్యోన్ముఖం చేస్తున్న

# శ్రీ కృష్ణస్వామి మధుర రచనలు

స్వామి గేయాలు
దర్శనాలు-నిదర్శనాలు 1,2 భాగాలు
అన్వేషణ - అనుభూతి
అక్షరాల్లో అనుభూతులు 1, 2, 3, 4 భాగాలు
మానవ సేవలో మాస్టర్ ఇ. కె.
ప్రేయరు - పద్ధతి
సంభాషణలు - సమన్వయాలు
సరసాల్లో నవరసాలు 1, 2, 3 భాగాలు
మాటలు - మంత్రాలు 1, 2 భాగాలు
కులపతి కృష్ణమాచార్య
స్వామి పలుకులు - స్వాతి చినుకులు 1, 2 భాగాలు
మాటల మధ్యలో రాలిన ముత్యాలు 1, 2 భాగాలు
స్వామిలేఖలు - శాంతిరేఖలు 1, 2 భాగాలు
పునర్నిర్మాణానికి శంఖారావం 1, 2 భాగాలు
ఇదీ మన సంస్కృతి - ఇదీ మన సంప్రదాయం
కామధేనువు కనికరించిన వేళ
నిత్యసత్యాలు ఆణిముత్యాలు 1, 2 భాగాలు
పూజా విధానము - రుద్రాభిషేకము
నిత్యజీవితానికి నియమావళి
హోమియో విధానము-ఒక అవగాహన
ప్రథమ చికిత్స - తరుణ వ్యాధులు
రామాయణము - మానవ ధర్మము
భారతం - ధర్మాద్వైతం
శ్రీమద్భాగవతము - దివ్య జీవన మార్గము
మాస్టర్ యమ్. కె. హోమియో తత్త్వశాస్త్ర ప్రవచనాలు
మాస్టర్ యమ్. కె. హోమియో ఔషధ శాస్త్ర ప్రవచనాలు

**బోధతో వెలిగించు - వెలుగుతూ బోధించు** MK